# కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక
# మహిళా జన జీవనం

జె. కనకదుర్గ

# కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక మహిళా జన జీవనం

జె. కనకదుర్గ

కాకతీయ విశ్వవిద్యాలయము
తెలుగు విభాగం నుండి యం. ఫిల్ డిగ్రీ
పొందిన సిద్ధాంత వ్యాసం

# కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక మహిళా జన జీవనం

కాపీరైటు-రచయిత్రిది
ప్రథమ ముద్రణ : 1992
ప్రతులు - 1000

వెల : 12-00

ప్రతులకు

జె. కనకదుర్గ
లెక్చరర్, తెలుగు విభాగం
సింగరేణీ కాలరీస్ మహిళా కళాశాల
కొత్తగూడెం - ఖమ్మం జిల్లా

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ముద్రితం

ము ం దు మా ట

# మహిళాజన జీవన అధ్యయన పద్ధతి గురించి ....

సమాజంలో స్త్రీ స్థానాన్ని, స్త్రీ పురుష సంబంధాలను నిర్దేశించే రాజకీయార్థిక సూత్రాలను అధ్యయనం చేయటం మహిళాజన జీవన అధ్యయనం. ఆ నిర్దిష్ట రాజకీయార్థిక సాంస్కృతిక సూత్రాలను క్రోడీకరించి, విశ్లేషించి అన్ని కోణాల నుండి సమగ్రంగా అధ్యయనం చేయటం వలన సమాజంలో స్త్రీ పురుషుల మధ్య కొనసాగి వస్తున్న అసమానతలు అర్థం కావటమే కాదు, వాటిని పరిష్కరించు కొనేందుకు మార్గాలు కూడా అవగతమవుతాయి. ఈ రకమైన అధ్యయనాలు తెలుగు సాహిత్యంలో ఇప్పుడిప్పుడే మొదలవుతున్నాయి. శ్రీమతి జె. కనకదుర్గ వ్రాసిన ఈ సిద్ధాంత వ్యాసం ఆ కోవలోదే.

సాహిత్యంలో స్త్రీల గురించిన పరిశోధనలు అడపాదడపా జరుగుతూనే వున్నా అవి ప్రధానంగా కుటుంబ సంబంధాలలో భార్యలుగానో, తల్లులుగానో స్త్రీలు నిర్వహించే విధులను, బాధ్యతలను ప్రాతిపదికలుగా చేసుకొని వాళ్ళ ఔన్నత్యాన్ని నిరూపించేవిగానో, వాళ్ళ ప్రవృత్తులను నిరసించేవిగానో వున్నాయి. వివిధ సాహిత్య గ్రంథాలలో స్త్రీ పాత్ర ప్రవృత్తులను విశ్లేషిస్తూ వచ్చిన సిద్ధాంత వ్యాసాలు చాలా వరకు మహిళలు వ్రాసినవే. అయినా వాటిలో కూడా 'స్త్రీల దృష్టి కోణం 'కొరవడింది. అందువల్లనే స్త్రీలపై పెత్తనం చేసే కుటుంబం తదితర అధికార వ్యవస్థలను గురించి కానీ, స్త్రీల పరాధీనతను గురించి కానీ ఏ విధమైన ప్రశ్నలను ఈ గ్రంథాలు లేవనెత్తలేక పోయాయి. మిగిలిన సామాజిక శాస్త్రాల పరిశోధన విషయంలో కూడా ఇదే పరిస్థితి 1980 వరకు కొనసాగింది. 1981లో 'మహిళాజన జీవన అధ్యయనం' గురించిన చర్చతో మొదటిసారి జాతీయస్థాయి సదస్సు బొంబాయిలో జరిగిన తరువాత కానీ అన్ని సామాజిక మానవీయ విజ్ఞాన శాఖలలోను స్త్రీల దృష్టికోణం నుండి అధ్యయనం చేయటం, అవగాహన పెంచటం అనే అంశాలకు ప్రాధాన్యత రాలేదు. అప్పటి నుండి ఏ సాహిత్య సామాజిక భూమికలలోనైనా స్త్రీల జీవితాన్ని అధ్యయనం చేయటానికి కొత్త సాధనాలు, కొత్త సిద్ధాంతాలు అందుబాటులోకి వస్తూ పరిశోధనా రంగంలో నూతన చైతన్యాన్ని

వ్యాపింప చేశాయి. ఈ సమకాలీన సామాజిక విద్యావిషయక చైతన్యంతోటే. శ్రీమతి కనకదుర్గ 'కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక మహిళాజన జీవితం' అన్న ఈ యం. ఫిల్ సిద్ధాంత వ్యాసాన్ని వ్రాసారు.

సమాజంలో స్త్రీలు వివక్షకు. పీడనకు లోనవుతున్నారన్న అవగాహన నుండి మహిళాజన జీవన అధ్యయనం ప్రారంభమవుతుంది. కనుక 'సింహాసన ద్వాత్రింశిక,ను కేవలం ఒక కథా కావ్యంగా కాక అది రచించబడిన కాలంనాటి సామాజిక రాజకీయ సంస్కృతిలో అన్యోన్య సంబంధమున్న మానవ సంబంధాల సమాహార రూపంగా అర్థం చేసుకోవటం అవసరమూ, అనివార్యమూ అయింది. ఆ క్రమంలోనే స్త్రీలు వివక్షకు, పీడనకు గురికావాల్సిన పరిస్థితిని కల్పించిన రాజ్య స్వభావాన్ని, పితృస్వామ్య సామాజిక నిర్మాణాన్ని వివరించటం, నిరూపించటం ఈ సిద్ధాంత వ్యాస రచనకు తప్పనిసరి విషయాలయ్యాయి. ఈ విధమైన పరిశోధనలో కవిత్వాన్ని గురించి, శిల్పాన్ని గురించి, వర్ణనా వైచిత్రి గురించి, ఛందో వైవిధ్యం గురించి చర్చలు లేకపోగా రాజకీయార్థిక విషయాలు, సామాజిక చరిత్ర ఎక్కువ మోతాదులో ప్రవేశించాయన్న ఆరోపణ తరచు వినబడుతుంది. వీటిని సాహిత్య పరిశోధనలుగా అంగీకరించటం కూడా చాలా మందికి కష్టంగానే వుంటుంది. వేదాంత తర్కశాస్త్ర విషయాలు, కావ్యాలంకార ధర్మశాస్త్ర విషయాలు సాహిత్యానికి అనువర్తింపచేస్తు వచ్చే సిద్ధాంత గ్రంధాలలో వాటి ప్రమేయం ఎంత వున్నా అదంతా సాహిత్యంలో భాగంగా స్వీకరించగల 'శిక్షణ' మన సంప్రదాయ విద్యావిధానంలో వుంది. అందువల్ల సిద్ధాంత గ్రంధ రచనలో ఆ విషయాలు ఎంతగా ఉంటే ఆ రచయితకు అంత గొప్ప పాండిత్యం వున్నట్లు లెక్క. కానీ సామాజిక రాజకీయ అర్థశాస్త్ర విషయ విజ్ఞానంవల్ల సాహిత్యాన్ని మరింత సమగ్రంగా సక్రమంగా అర్థం చేసుకోవచ్చునన్న అవగాహన, సామాజికాంశాల ద్వారా సాహిత్యాన్ని ఎంత విస్తృతంగా లోతుగా అధ్యయనం చేయటానికి వీలుందో సాహిత్యం ద్వారా సమాజాన్ని సామాజిక చలన సూత్రాలను అంత సజీవంగా తెలుసుకోవటానికి వీలవుతుందన్న శాస్త్రీయ దృష్టి కోణం అభివృద్ధి చెందుతున్న కాలమిది. కనుక సామాజికార్థిక చారిత్రక విషయాలను, సాహిత్యాన్ని అర్థం చేసుకోవటానికి కావలసిన సూత్రాలనిచ్చే మూలాంశంగా స్వీకరించగలిగే

'శిక్షణ' మనకిప్పుడు కావాలి, 'సింహాసన ద్వాత్రింశిక-మహిళాజన జీవనం' వంటి పరిశోధనా వ్యాసాలు మరిన్ని వచ్చేకొద్దీ ఈ పని సులువు అవుతుంది.

'మహిళాజన జీవన అధ్యయనం' ఒక దృక్పథంగా అభివృద్ధి చెందటానికి 'స్త్రీ వాదం' (ఫెమినిజం) గురించిన అవగాహన అవసరం సమాజంలో స్త్రీ పురుషుల మధ్య సంబంధాలను నిర్దేశిస్తూ, నియంత్రిస్తూ, వ్యవస్థీకరిస్తూ వచ్చిన ధర్మశాస్త్ర, నీతిశాస్త్ర విషయ జ్ఞానం అవసరం. ఈ రెండింటినీ కలుపుకొని ప్రాతిపదికలుగా చేసుకొని సంప్రదాయ సాహిత్యాన్ని అధ్యయనం చేస్తే ఇతిహాసపు చీకటి కోణం అట్టడుగున పడి ఇన్నాళ్ళు కనిపించని స్త్రీల కథలు, చరిత్రలు, జీవితం మనకు తెలిసి వస్తాయి. స్త్రీలకు స్వస్వరూప జ్ఞానాన్ని కలిగిస్తాయి. స్త్రీల పరిస్థితిలో మార్పుకు, మానవ సంబంధాల పునర్నిర్మాణానికి ప్రేరణ నిస్తాయి. ఆ రకంగా సాహిత్య ప్రయోజనాన్ని విలువ కట్టటానికి కూడా మహిళా జన జీవన అధ్యయనం ఉపకరిస్తుంది.

సంప్రదాయ సాహిత్యంలో అభిరుచి కలిగిన శ్రీమతి కనకదుర్గ మహిళాజన జీవన అధ్యయన దృక్పథాన్ని అలవరచుకొని 'కొరవి గోపరాజు సింహాస ద్వాత్రింశిక' మీద ఈ సిద్ధాంత వ్యాసం వ్రాసినందుకు అభినందనీయురాలు. ఆమె పట్టుదల మనిషి. గట్టిగా కృషి చేయగలరు. యం. ఫిల్ సిద్ధాంత వ్యాస రచనతో వేసుకొన్న పునాదిని మరింత గట్టి పరచుకొని మహిళాజన జీవన అధ్యయన రంగంలో తెలుగు సాహిత్య విమర్శను సమగ్రము, శాస్త్రీయమూ చేసేందుకు తమవంతు కృషిని సాగిస్తారని నా విశ్వాసం,

'పశ్యంతి'
5-6-92

కాత్యాయనీ విద్మహే

# కృతజ్ఞతలు

కాకతీయ విశ్వ విద్యాలయం తెలుగు విభాగం నుండి 1990లో ఎమ్. ఫిల్ డిగ్రీకై కృషిచేసి సమర్పించిన సిద్ధాంత వ్యాసం ఇది. సమాజంలో సగభాగమైన మహిళల జీవనాన్ని పరిశీలించటం వృత్తికి ప్రవృత్తికి కూడ అనుకూలమైనదని భావించటంవల్ల "కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక-మహిళాజన జీవనం" అనే ఈ సిద్ధాంత వ్యాసాని వ్రాసాను. మహిళాజన జీవనాన్ని వివిధ దృక్కోణా ల నుండి అనుశీలించే అభిరుచి కలిగిన డా. కాత్యాయనిగారు తమ పరిశీలనాను భవాన్ని పంచిపెట్టి పరస్పర అవగాహనా పూర్వకమైన వాతావరణాన్ని కల్పించి నాలోని పరిశోధనా దృష్టిని జాగృతం చేయటంచేత ఈ సిద్ధాంత వ్యాసం ఇలా రూపుదిద్దుకొంది. ఇప్పుడు తెలుగు విశ్వవిద్యాలయంవారు అందించిన ఆర్థిక సహా యం ప్రేరకమై పుస్తక రూపంలో వెలువడుతోంది.

కావ్యశైలీ సౌందర్యాలు బాహిరమైనవైతే, కథావస్తువులో అంతర్గత సత్యం ఇమిడి ఉంటుంది. సామాజిక ప్రతిఫలనం తప్పనిసరిగా ఉండే సాహిత్యాన్ని సామాజిక దృక్పథం నుండి పరిశోధించటం సరియైన పద్ధతి అన్న అవగాహనను కలిగించిన అధ్యాపకులు కీ. శే. కేతవరపు రామకోటిశాస్త్రి గారిని స్మరించకుండా ఉండలేను. ఈ పరిశోధనా గ్రంథం వ్రాసే కాలంలో, కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం నుండి సహాయ సహకారాలనందించిన ఆచార్యులు, శ్రీ కొవెల సుప్రసన్నా చార్యులు. శ్రీ పేర్వారం జగన్నాథం గారు, శ్రీ మాదిరాజు రంగారావుగారు వీరందరికి కృతజ్ఞతలు.

పరిశోధన చేయటానికి అవకాశం ఇచ్చిన సింగరేణీ కాలరీస్ యాజమాన్యం వారికి, మహిళా కళాశాల ప్రధానాధ్యాపకులకు, ముద్రణకై ఆర్థిక సహాయాన్ని అందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నా.

సకాలంలో ముద్రించి ఇచ్చిన జ్యోతి ప్రింటర్స్, కొత్తగూడెం వారికి ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించిన అందరికీ కృతజ్ఞతలు.

మా అమ్మ, నాన్నలైన శ్రీమతి లక్ష్మిప్రసన్నం, శ్రీ జంధ్యాల కుమార స్వామి యొక్క ప్రోత్సాహం నన్ను పరిశోధనా రంగంలో ముందడుగు వేయి స్తోందని తెలియజేయటానికి సంతోషిస్తున్నాను.

శ్రీ ఎమ్. వి. శాస్త్రిగారి సహకారంతో పాటు సోదరుల ప్రోత్సాహాన్ని అందు కుంటు పరిశోధనలో ముందుకు కొనసాగాలనుకుంటున్నాను.

మొదటి నుండి నా చదువును ప్రోత్సహించి, నేని కృషిచెయ్యాలని ఆశించి, మహిళాభ్యున్నతికై తన ఆకాంక్షను స్మృతిగా మిగిల్చిన అన్నయ్య డా॥ జె. రామకృష్ణకు అంజలి ఘటిస్తూ

కనకదుర్గ

# కొరవి గోపరాజు _ సింహాసన ద్వాత్రింశిక
# మహిళా జన జీవనము

## 1.1. పరిశోధనా–పద్ధతి :

'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' నిర్మాత అయిన సురవరం ప్రతాపరెడ్డిగారు సాంఘిక చరిత్ర రచనకు పనికివచ్చు సాధనములలో ఒకటిగా తెలుగు సారస్వతాన్ని పేర్కొన్నారు. కావ్య ప్రబంధాలలో నూటికి తొంభైపాళ్ళు సాంఘిక చరిత్రను పనికి వచ్చేవి కావని చెప్తూ జక్కన 'విక్రమార్క చరిత్ర' కవిత్వ విశేషాలనుబట్టి మంచి 'ఇమిడిక'తో 'వన్నె' కలిగిఉన్న కావ్యమైనప్పటికి[1] అందులో సాంఘిక రచనకు పనికివచ్చే విషయమేదీ లేదని అవే కథలతో కొరవి గోపరాజు వ్రాసిన 'సింహాసన ద్వాత్రింశిక' అందుకు అత్యంత సహాయకారి అని సురవరం ప్రతాప రెడ్డిగారు స్పష్టం చేశారు[2]. ఆంధ్రుల సాంఘిక చరిత్ర రచనకు 'సింహాసన ద్వాత్రింశిక' ప్రధాన ఆధారమైందనే సురవరంవారి అభిప్రాయం ప్రేరణ కాగా 14, 15 శతాబ్దంనాటి ఈ కావ్యంలో ప్రతిఫలించిన సాంఘిక వ్యవస్థలో మహిళా జనజీవితం ఎట్లా చిత్రమైందో ప్రత్యేకించి అధ్యయనం చేయాలనిపించింది. సమాజంలో స్త్రీలుకూడ భాగస్వాములు కనుక స్త్రీనొక భోగవస్తువుగా, సొమ్ముగా చూసిన మధ్యయుగాల సంస్కృతినుండి పుట్టిన కావ్యాన్ని అనుశీలిస్తే స్త్రీల స్థితి గతులు వెలికి వస్తాయని, సామాజిక ప్రయోజన దృక్పథంతో విలువకట్టి వాటి స్వరూప స్వభావాలు నిరూపించాలని 15 శతాబ్దంనాటికి సంబంధించిన ఈ కావ్యాన్ని పరిశోధనాంశంగా గ్రహించటం జరిగింది.

సింహాసన ద్వాత్రింశికను మొదటగా ప్రచురించినది ఆంధ్ర సాహిత్య పరిషత్తు. పరిషత్పత్రిక పుస్తక భాండాగారంలోని తాళపత్ర ప్రతిని, చెన్నపురిలోని రాజకీయ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలోని ప్రతిని ఆధారంగా చేసుకొని తయారుచేయబడిన శుద్ధప్రతిని వేదాప్రగడ బ్రహ్మానందరావు పంతులు గారిచ్చిన కాగితపు ప్రతితో సరిపోల్చి సవరించి ఐదాశ్వాసముల నుండి చివరివరకు ద్వితీయ భాగంగా 1933లో మొదటిసారిగా అచ్చువేశారు. తరువాత మరిన్ని ప్రతులను సంపాదించి ప్రథమభాగాన్ని 1936లో ప్రచురించటం జరిగింది.[3] వెంపరాల సూర్యనారాయణగారు దీనికి విపులమైన పీఠికను కూర్చినారు. సింహాసన ద్వాత్రింశిక గురించి మొదటి రచన అదేనని చెప్పుకోవచ్చు. వీరేశలింగంగారు అంతకుముందు ఆంధ్ర కవుల చరిత్రలో కొరవి గోపరాజు గురించి పేర్కొన్నారు (1899). వెంపరాల వారి తర్వాత 1946 నవంబరు భారతిలో బులుసు వెంకటేశ్వర్లుగారు

గోపరాజును గురించి 'అభ్యుదయ రచయితలకు అభ్యుదయ రచయిత' అనే శీర్షికతో వ్రాశారు. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'కొరవి గోపరాజు-సింహాసన ద్వాత్రింశిక' అనే శీర్షికతో వ్రాసిన వ్యాసం 1946లో ప్రచురింపబడిన ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరాయ షష్టిపూర్తి సంచికలో అచ్చయింది. చాగంటి శేషయ్యగారు ఆంధ్రకవి తరంగిణిలోనూ(1949), ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం 7వ సంపుటంలోనూ (1965) కొరవి గోపరాజు గురించి వ్రాశారు. తర్వాత చేకుపళ్ళ కామేశ్వరరావుగారు కొరవి గోపరాజు కాలము అనే శీర్షికతో ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో (1967) ఒక వ్యాసం వ్రాశారు. అనుమాండ్ల భూమయ్యగారి 'ఎమ్.ఫిల్' పరిశోధనా రచనగా కొరవి గోపరాజు సాహిత్యవిశ్లేషణ అనే గ్రంథం 1983లో వచ్చింది.

ఈ విధంగా సింహాసన ద్వాత్రింశికను గురించి ఆలోచించిన పండితులు, విమర్శకులు, పరిశోధకులు తమ తమ రచనలలో కావ్యమును గురించి, కవి కాలాన్ని గురించి, కవిత్వ విశేషాలను గురించి వివరించారు. కావ్యంలోని కథాకథన నైపుణ్యాన్ని నిరూపించారు.

ఐతే ఈ రచనలు ఏవీకూడా కొరవి గోపరాజు కాలానికి అతను సృష్టించిన కావ్యేతి వృత్తానికి ఉన్న అంతర గతి తార్కిక సంబంధాన్ని పట్టించుకోలేదు. అందువల్ల సాహిత్యానికి సమాజానికి ఉన్న అన్యోన్య సంబంధాన్ని ప్రాతిపదికగా చేసుకొని సింహాసన ద్వాత్రింశికలోని కథలను విశ్లేషించటం ద్వారా చరిత్రగతిలో స్త్రీల జీవితాలను ఏ శక్తులు నడిపించాయో అర్థంచేసుకోవటం ఈనాటి అవసరంగా గుర్తించి ఈ పరిశోధనకు పూనుకోవటం జరిగింది.

మధ్యయుగాలనాటికి బలపడిన పితృస్వామిక రాజ్య స్వభావం స్త్రీలను సమాజంలో రెండవస్థాయి వ్యక్తులుగా ఎలా నిలిపిందో ఈ కావ్యం నిరూపిస్తుంది. కవి కూడా పాలక వర్గానికి, పురుషాధిక్య సమాజానికి చెందినవాడు కావటం వల్ల స్త్రీల గురించి ఆలోచించి వాళ్ళ దృక్పథంనుండి ఈ కావ్యాన్ని వ్రాయలేక పోయాడు. అయినప్పటికీ సాహిత్యం మానవ జీవిత సంబంధాలను చిత్రించటం అనివార్యం కనుక, మానవ జీవిత సంబంధాలలో స్త్రీలు మౌనంగానైనా పాత్రనే ఉంటారు కనక జనజీవితంలో వాళ్ళ మూగపాత్రనైనా కవులు చిత్రించక తప్పదు. అందువల్ల సాహిత్యం మహిళాజన జీవన విధానాన్ని అర్థం చేసుకోవటానికి ఏదో ఒక మేరకు ఉపయోగపడుతుందనేది స్పష్టం. అందువల్లనే సింహాసన ద్వాత్రిం

శికను ఆధారం చేసుకొని మధ్యయుగాలనాటి సంస్కృతి మహిళా జనజీవితం ఎట్లా ఉండాలని నిర్దేశించిందో నిరూపించటానికై ఈ పరిశోధనకు పూనుకోవటం జరిగింది.

సింహాసన ద్వాత్రింశికను 14, 15 శతాబ్దాలనాటి సాంఘిక సంస్కృతికి వ్యాఖ్యానంగా భావిస్తే నాటి ఉపరితల సాంఘిక భావజాల సంస్కృతికి కారణమైన పునాది యందలి ఆర్థిక వ్యవస్థా స్వరూపాన్ని ఆకళింపు చేసుకోవాలి. అందుకోసం చారిత్రక భౌతికవాద దృష్టికోణం నుండి ఈ పరిశోధనను కొనసాగించటం జరుగుతుంది.

విక్రమార్కుడి సాహస, ఔదార్యాదులకు సంబంధించిన కాల్పనిక కథల లోపలి పొరలలో ఉన్న సామాజిక సాంస్కృతిక అవశేషాల విశేషాలు వెలికితీసి సామాజిక చారిత్రక నేపథ్యం నుండి వ్యాఖ్యానించటం ద్వారా మధ్య యుగాలనాటి మహిళా జన జీవితాన్ని రూపుకట్టించే ప్రయత్నమే ఈ పరిశోధన[4].

## 1.2. కవి—కాలము—దేశము :

కొరవి గోపరాజు రచించిన 'సింహాసన ద్వాత్రింశిక' అనేక కథలతో కూడిన కావ్యం. ఇందులోని మానవ జీవన సంబంధాలను అర్థంచేసుకోవటానికి ఈ కావ్యం ఏ కాలంనాటిదో తెలియాలి. కావ్యం ఏ కాలంనాటిదో తెలియాలంటే కవి కాలంగురించి తెలుసుకోవటాన్ని మించి మరో ఆధారంలేదు. సాహిత్యచరిత్ర అంతా కవికాలాల నిర్ణయంమీదే ఆధారపడి నిర్మించబడిన పరిస్థితులలో తెలుగులో కావ్య కాలాన్ని, కవి కాలాన్ని బట్టే నిర్ధారణ చేయాలి. అందువల్ల సింహాసనద్వాత్రింశికా రచయిత అయిన కొరవి గోపరాజు ఏ కాలంవాడో నిర్ధారించటం అవసరం.

కొరవి గోపరాజు కాలాన్ని నిర్ధారించటంలో సాహిత్య చరిత్రకారులలో ఏకాభిప్రాయం లేదు. కొరవి గోపరాజు కాలాన్ని నిర్ణయించటంలో 'సింహాసన ద్వాత్రింశిక' లోని వర్ణితమైన గోపరాజు వంశావళి వివరాలు, అందులోని చారిత్రక విశేషాలు ఆధారాలయినవి. వీటినుండి ముఖ్యమైన రెండు ప్రాతిపదికాంశములను నిర్దేశించుకుని వాటిని ఆధారంగా చేసుకొని గోపరాజు కాలాన్ని నిర్ణయించటం జరిగింది. ఆశ్వాసాంత పద్యాలలో గోపరాజు 'వెన్నయామాత్య పౌత్రుని'గా చెప్పుకున్నను, వంశవర్ణన సందర్భాన్ని బట్టి గోపరాజు వెన్నయామాత్యునికి ఏడవతరం వాడు. వెన్నయామాత్యుని కాలం 1220 ప్రాంతమని చరిత్ర చెబుతున్నది. అతనికి

గోపరాజు ఏడవ తరంవాడు కనుక కొరవి గోపరాజును తరానికి 25 సంవత్సరాలు చొప్పున[5] లెక్కగట్టి దాదాపు 14వ శతాబ్దమునకు చెందినవాడుగాను, తరానికి 40 సంవత్సరములు చొప్పున[6] లెక్కగట్టి 15వ శతాబ్దమునకు చెందిన వాడుగానూ చెప్పుకోవచ్చును. వెన్నయామాత్యునికిఏడవతరంవాడని 'కావ్యావతారిక'లో స్పష్టంగా ఉన్నప్పటికీ ఒకతరం యొక్క జీవితకాలం నిర్ధారించటంలోని తేడాలను బట్టి కవి కాల నిర్ణయంలో వంద సంవత్సరాల వ్యవధి చోటుచేసుకున్నది.

ఇక గోపరాజు పూర్వకవిస్తుతిలో 'పిల్లలమఱ్ఱిని' స్తుతించటాన్ని బట్టి(1-12) అతడు 1485-1490 సంవత్సరాలకు చెందినవాడని చారిత్రకాధారాలు ఉండటాన్ని బట్టి గోపరాజు పినవీరభద్రునికి సమకాలీనుడై ఉండటమో, కాకపోతే తదనంతర కవి కావటమో జరుగుతుంది. కనుక గోపరాజును పీఠికలో వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు చెప్పినట్లు 15వ శతాబ్దికి చెందినవాడుగా నిర్ణయించవచ్చును. కందుకూరి వీరేశలింగంగారు పిల్లలమఱ్ఱి పినవీరన్నకు, పెదవీరన్న అనే అన్న ఉన్నట్టు పేర్కొనుటచే అతని సమకాలీనుడుకూడ అయిఉండవచ్చు.

కావ్యంలోని వంశవర్ణనలో గోపరాజు తన తండ్రి కసవరాజని, తల్లి కామాంబికయని (1-51) పేర్కొన్నాడు. తండ్రి కసవరాజు వేములగల్లు జన్మభూమిగా (1-53) పెరిగినట్లుకూడా కావ్యావతారిక వల్ల స్పష్టమవుతుంది. ఈ వేములగల్లు తెలంగాణము[7] లోనిదని కొందరు, మహబూబ్‌నగర్[8] జిల్లాలోనిదని కొందరు, నిజామాబాద్‌జిల్లా[9] లోనిదని మరికొందరు అభిప్రాయపడుచున్నారు. గోపరాజు చేసిన 'ధర్మపురి' వర్ణనను(8-177) బట్టి గోపరాజు 'కరీంనగర్‌జిల్లాకు చెందినవాడని, ఓరుగల్లును (8-156) చెప్పుటచే వరంగల్లుకు దగ్గర ప్రాంతము వాడ'ని[10] అభిప్రాయపడిరి.

కావ్యంలోని 8వ ఆశ్వాసంలో 21వ బొమ్మ చెప్పిన (8-158) కథలో విక్రమార్కుడు ఉష్ణగుండము నుండి బయటికి వచ్చి యోగినులిచ్చిన రత్నాలు తీసికొని తర్వాత శ్రీశైలం, అహోబిలాలలోని శివకేశవులను దర్శించి అక్కడనుండి 'కాకతిమూలశక్తి గనిగా కల (8-156) ఓరుగంటిని దర్శించినట్లు ఉంది. ఆ నగరాన్ని వర్ణిస్తూ కాకతి భూపతి రాజ్యలక్ష్మి పెంపొంది(8-158) ఉన్నదని అంటాడు కవి. ఆ కాకతి భూపతి కాకతీయ సామ్రాజ్య ఉచ్ఛదశలో నున్న ప్రతాపరుద్రుడే అయి ఉంటాడనుకుంటే ప్రతాపరుద్రుడు 1326 వరకు జీవించి ఉన్నాడు కనుక 14వ శతాబ్ది వాడైన కొరవి గోపరాజు తనకంటె వంద సంవత్సరాల క్రితం గొప్ప

స్థితిలో నున్న కాకతీయ సామ్రాజ్య వైభవాన్ని ప్రస్తుతించాడని అనుకోవాలి. క్రీ.శ. 1200 ప్రాంతమువాడైన గణపతిదేవుని కాలంలో ఓరుగల్లు రాజధానిగా నున్నది. క్రీ.శ. 1323 ప్రాంతంలో ప్రతాపరుద్రుని పతనంతో కాకతీయుల ఏలుబడి సమాప్తి నొందుటచే క్రీ.శ. 1200-1300 సం౹౹ల మధ్యకాలంలో రచింపబడియుండవచ్చునని నేలటూరి వేంకటరమణయ్యగారు వాఙ్మయ వ్యాసమంజరిలో పేర్కొన్నారు.

విక్రమార్కుడు చారిత్రక వ్యక్తి ఐతే[11] కొరవి గోపరాజుకు సమకాలికుడుగానూ, కాకపోతే అంతకంటే ముందు ఉన్న ప్రసిద్ధి చెందిన కాకతీయుల కాలంలోని వాడుగానూ ఉండటానికి వీల్లేదు. ఎందుకంటే 'సింహాసన ద్వాత్రింశికలో కవి విక్రమార్కుడ్ని గురించి అతనెప్పటివాడో ఆలోచించటానికి ప్రేరకంగా 'చంద్రగుప్త నాత్మజుండని' (1-76) 'శకకర్తయై ధరిత్రి కీర్తినెఱిపె' (1-114) నని పేర్కొన్నాడు.

విక్రమార్కుడు అనే పేరుతో పురాణాలలో ఒకవ్యక్తి,చరిత్రలో మరొకవ్యక్తి కనపడుతున్నారు. గుప్తరాజులలో సముద్రగుప్తుడి కొడుకైన రెండవ చంద్రుగుప్తుడే విక్రమాదిత్యుడిగా ప్రసిద్ధి చెందినవాడని, అతడు క్రీ. శ. 400 సంవత్సరముల వాడని చరిత్ర చెబుతున్నది[12]. కొరవి గోపరాజు పేర్కొన్నట్లు సింహాసన ద్వాత్రింశికలోని చంద్రగుప్తుని ఆత్మజుడిగా పేర్కొనబడిన విక్రమార్కుడు చారిత్రక విక్రమార్కుడు కావటానికి వీలులేదు. ఆ విక్రమార్కుడు చారిత్రక వ్యక్తియే ఐతే అతను కాకతీయుల కాలంలోని[13] వాడనటానికి వీలులేదు. సింహాసన ద్వాత్రింశికలో కవి విక్రమార్కుడు శకకర్తయై ధరిత్రి కీర్తి నెఱిపె. (1-114) నని పేర్కొన్నాడు. ఈ విక్రమార్కుడు పురాణాలలో పేర్కొన్న విక్రమార్కుడై ఉండచ్చు. భవిష్య మహాపురాణంలో క్రీ. పూ. 101 లో గంధర్వసేనునకు శివుని ఆజ్ఞవలన పుట్టిన కుమారునికి 'విక్రమాదిత్యు'డని పేరు ఉన్నట్లు, అతడు తన 20వ సంవత్సరమున అనగా క్రీ. పూ. 82వ సంవత్సరములో 32 మూర్తులు కల్గిన సింహాసన మధిష్ఠించి, నూరు సంవత్సరములు రాజ్యం చేసినట్లు ఉంది[14]. పురాణప్రసిద్ధుడైన విక్రమార్కుడు పారంపర్యంగా జనజీవన సంస్కృతిలో కొనసాగి వస్తూ తెలుగు జనావళియొక్క కాల్పనిక శక్తికి అద్భుతకథాకథన చాతుర్యానికి కేంద్రం అయి ఉంటాడు[15]. ఆ క్రమంలోనే కొరవి గోపరాజు కూడ విక్రమార్కుడిని కేంద్రంగా చేసుకొని అల్లబడిన సాహస ఔదార్యాది గుణ సంపదను వస్తువుగా చేసి సింహాసన ద్వాత్రింశికను వ్రాశాడు. ప్రజల ఊహల్లో, ఆలోచనలలో ఎప్పుడు

బడితే అప్పుడు ఒక అద్భుతనాయకుడిగా ప్రవేశించే పురాణ విక్రమాదిత్యుడు ఏ కాలంలోనైనా ఉండవచ్చు. అందువల్లనే కవి విక్రమార్కుడిని ఐతరేయ బ్రాహ్మణ కాలానికి చెందిన విశ్వామిత్ర కాలానికి తీసుకొని వెళ్ళగలిగాడు [16]. అలాగే తన ప్రాంతానికి, సమీప గతానికి చెందిన ప్రసిద్ధ కాకతి భూపతుల కాలానికి కూడా తీసుకురాగలిగాడు. విశ్వామిత్రుడి కాలానికి, విక్రమార్కుని కాలానికి ఎంత చారిత్రక వైరుధ్యం ఉందో విక్రమార్కుని కాలానికి, కాకతీయుల కాలానికి అంతే చారిత్రక వైరుధ్యం ఉంది. దీనిని గడియారం వారు గమనించినట్లు లేదు [17].

'సింహాసనద్వాత్రింశిక' స్వతంత్ర కావ్యము కాక సంస్కృతభాష నచ్చుగా జేసినదని (1-35) కవి స్వపరిచయాదులవ్యల్ల తెలుస్తున్నది. దీనికి మూలమైన సంస్కృత కావ్యాన్ని గురించిన నిర్ధిష్టమైన ఆధారంలేదు. సింహాసన ద్వాత్రింశికకు మూలం గద్య పద్యాత్మకమైన ఒక సంస్కృత విక్రమార్క చరిత్ర మున్నదని నిర్ధిష్టంగా చెప్పిన గడియారంవారు కూడ ఆ గ్రంథ స్వరూప స్వభావాలను గురించి మూలగ్రంథ రచయిత గురించి వివరాలేవీ యివ్వలేకపోయారు. ఏకామ్రనాథుడు సింహాసన ద్వాత్రింశిక పేరుతో రచించిన వచన రచన [19] దీనికి మూలమని ఇంకొక అభిప్రాయంకూడ ఉన్నది. ఏ కవి వ్రాసిన ఏ గ్రంథం మూలమో స్పష్టంగా నిర్దేశించుకోవటానికి తగినన్ని ఆధారాలు లేనప్పటికీ స్థూలంగా ఏదో ఒక సంస్కృత మూలగ్రంథం ఆధారంగా ఈ కావ్య రచన జరిగినట్లు మాత్రం చెప్పవచ్చును. కాని భవిష్య మహాపురాణంలో పార్వతి ముప్పది రెండు బొమ్మలు కలిగిన విక్రమార్కుని సింహాసన రక్షణకై భేతాళుని నియమించగా భేతాళుడు బ్రాహ్మణ రూపంలో వచ్చి చెప్పిన 32 కథలు 32 అధ్యాయాలుగా పురాణంలోనే ఉన్నవని అవి 'ద్వాత్రింశత్సాలభంజిక' కథలని ప్రచారంలో ఉన్నట్లు చెప్పబడింది. ఈ కథలే ఈ కథాకావ్య రచనలన్నింటికి మూలమనుకోవచ్చు.

## 1.3. కావ్యము-కథ :

'సింహాసన ద్వాత్రింశిక' పన్నెండు ఆశ్వాసాలకావ్యము. భోజరాజు సింహాసన మెక్కబోవునప్పుడు 32 మెట్లమీదనున్న ముప్పదిరెండు బొమ్మలు ఆ సింహాసనం విక్రమార్కునిదని, ఆతనికున్న సాహసౌదార్యాలు, దానగుణాదులు, శక్తి సామర్థ్యాలు ఉన్నవాడు మాత్రమే ఆ సింహాసనం ఎక్కటానికి అర్హుడని, ఒకదాని తర్వాత ఒకటిగా చెప్తూ అతనిని నిరోధిస్తూంటాయి. ఆ సందర్భంలో అతని

గుణగణాలకు నిదర్శనంగా ఒక్కొక్క బొమ్మ ఒక్కొక్క కథ చెబుతుంది. ముప్పదిరెండు బొమ్మలు చెప్పిన ముప్పదిరెండు కథలు కాక వాటిలోని అవాంతర కథలు మరొక ఎనిమిది ఉన్నాయి. అవి మొదటి బొమ్మ చెప్పిన సుదర్శనుని కథ, చదురంగతజ్ఞుని కథ, మూడవ బొమ్మచెప్పిన గౌశికుని కథ, ఎనిమిదవ బొమ్మ చెప్పిన శంఖపాలుని కథ, పదుకొండవ బొమ్మ చెప్పిన జీమూతవాహనుని కథ, పదునాల్గవ బొమ్మ చెప్పిన రాజశేఖరుని కథ, పదహారవబొమ్మ చెప్పిన కలహకంటక ఏకాంగవీరుల ద్వంద్వయుద్ధకథ, ఇరవైఏడవ బొమ్మచెప్పిన మతిమంతుని కథ, ఇంతేకాక ప్రథమాఖ్యానంలోని బహుశ్రుతిని కథ, దానిలో మళ్ళీ అవాంతరంగా వచ్చే మరి రెండు ఉపకథలు ఉన్నాయి. అవి బోయ, పాము, పులి–పులుగు కథలు. ముప్పదిరెండు బొమ్మలు చెప్పిన కథలను అవాంతర కథలతోసహా శివుడు పార్వతికి చెప్పినట్లు 'సింహాసన ద్వాత్రింశిక' కథాప్రారంభంలో ఉంది.

పార్వతి శివుడికి 'క్రొత్త కథల్గలవేని గోరి వినంగా జిత్తంబుత్తలపడియెడి' (1–65) నని చెప్పి 'ప్రొద్దుపుత్తమెఱింగింప గదె' అని కథలు చెప్పమని అడిగిందట. సుఖాసీనుండై శివుడు 'యేకతమున' (1–66) పార్వతికి ఈ కథలన్నీ చెప్పాడు. పార్వతికేకాదు ప్రతి మనిషికి కథలను వినాలనే కుతూహలం ఉంటుంది. ఆ కుతూహలమే జ్ఞానాభివృద్ధికి కారణం అవుతుంది. తోటి వ్యక్తులకు మానవుడు తన అనుభవాలను పంచిపెడుతూ సమాజ జీవితం అభివృద్ధికరంగా పరిణమించడానికి కారకుడవుతాడు. ఆ అనుభవాలే కథలు అవుతాయి. ఒక ప్రత్యేక వ్యక్తి అనుభవాన్ని, అనుభూతుల్ని పంచుకోవటం వలన విస్తరించిన జీవితానుభవంతో ఇతరులు కూడా సామాజిక పురోగమనానికి సూత్రధారులవుతారు.

కథను వినాలనుకోవటం కూడ అనుభవాన్ని అభివృద్ధి చేసుకోవటంకొరకే. మానవునిలో కథ వినాలనే కుతూహలం, జిజ్ఞాస సజీవతకు చిహ్నాలు. కథ జన జీవితంలో భాగమై ఉంటుంది. అనుభవాన్ని పంచుకొనే క్రమంలో రూపొందటం చేత కథ ప్రాథమికంగా మౌఖిక రూపంలో అభివ్యక్తమవుతుంది.

గత కాలపు అనుభవాలు ఆ గతానికి విజ్ఞానావు గుళికల్లా ఉంటాయి. ఆ అనుభవజ్ఞానం కథలద్వారా తరతరాలకు అందివస్తూ, భూతకాలం మెనుభూతమై జనావళిని నిరాశా నిస్పృహలకు లోనుగానీయకుండా అభివృద్ధిని సాధించే ధైర్యోత్సాహాలను కల్గిస్తుంది. ఆ అనుభవజ్ఞానాన్ని పొదుపుకొని బుద్ధిని వికసింపచేయగల కథ కాలక్షేపానికే కాకుండా కర్తవ్యోన్ముఖం చేయగల స్వభావాన్ని కూడా కలిగి వుంటుంది.

కథ లెప్పుడూ కొత్తవే అయి ఉండాలి. మనిషికి తనకున్న అనుభవాలే కథలద్వారా మళ్ళీ అంది వచ్చేటట్లయితే వ్యక్తిగా ఎదగటానికి అంతగా అవకాశం ఉండదు. వ్యక్తి జీవితం సామాజిక జీవితానుభవంనుండి విస్తృతమైన ప్రయోజనాన్ని పొందాలంటే మనిషికి స్వీయానుభవాల కంటే విశిష్టమైన అనుభవాలు కథల ద్వారా అందిరావాలి. సామూహిక అనుభవాల జ్ఞానంవల్ల వికసించే సహజస్వభావం కారణంగానే క్రొత్త కథలపట్ల మనుషుల ఉత్సాహం ఎక్కువగా ఉంటుంది. సర్వజ్ఞులైన పురాణ పురుషులు దేవతలు కూడ కథలపట్ల కుతూహలం, ఉత్సాహం ప్రదర్శిస్తున్నట్లు కావ్యాలలో కనబడుతుందంటే వాళ్ళు కూడా మానవ స్వభావంతో చిత్రించబడటం వల్లనే. కథ శక్తిమంతమైంది కనుకనే ఆదిమాత అయిన పార్వతికూడ శివుణ్ణి క్రొత్త కథ చెప్పమని అడిగింది. కథావస్తువుమీద ప్రజలకు భక్తిశ్రద్ధలు ఏర్పడటానికి ఆ కథలెప్పుడూ పురాణపాత్రల చేతనే చెప్పబడతాయి. భారతకథశౌనకాది మహామునులకు ఉగ్రశ్రవసునిచేత చెప్పబడటంకూడ ఇక్కడ గమనించవచ్చు. శౌనకాది మహామునులు ఉగ్రశ్రవసుని కథ చెప్పమని అడుగుతూ అది 'అపూర్వము, హృద్యము' అయి 'ఎఱుక' సమగ్రం కావటానికి ఉపయోగపడేదిగా ఉండాలని చెప్పటం కథకి ఉన్న విస్తృత ప్రయోజనాన్ని భావించటం వల్లనే[20] అని స్పష్టమౌతుంది.

మానవుడికి భావాలు ఏర్పడి, వాటిని వినిమయం చేయటానికి భాష రూపు దిద్దుకొన్నప్పటినుండి మౌఖిక రూపంలో కథలున్నా లిపి కనుక్కొన్న తరువాతనే 'కథ' రచనా ప్రక్రియ అవుతుంది. నిజానికి కథ ప్రత్యేక రచనా ప్రక్రియ కావటం ఆధునిక యుగంలోకాని జరగలేదు. అయినప్పటికి తెలుగులో లిఖితసాహిత్యం ప్రారంభమైనప్పటినుండి కథ ఒక మూలాంశంగా ఏదో ఒక సాహిత్య ప్రక్రియను ఆశ్రయించుకొని సాగివస్తూనే ఉంది. ప్రారంభంలో అది భారత రామాయణాది ఇతిహాసాలలోను, భాగవతాది పురాణాలలోను, తరువాత శృంగార నైషధంలాంటి కావ్యాలలోనూ అంతర్భాగంగాఉంది. భారతేతిహాసంలోనూ, భాగవతాది పురాణాలలోనూ ప్రధానకథతోపాటు మరి అనేక కథలున్నాయి. భారతం అంతా ఉపాఖ్యానాల పుట్టకాబట్టి 'వింటే భారతం వినాలి, తింటే గారెలే తినాల'నే సూక్తి ఏర్పడింది. కథాకావ్యాలలో ప్రధాన కథకంటే కథలకే ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది. ఎందుకంటే కథలద్వారా కవి జీవిత వాస్తవాలను తన కల్పనా శక్తిచేత మెరుగుపెట్టి కళాత్మకంగా తన అనుభవాల్ని జనంతోపంచుకోవాలని తపన పడతాడు. తన జీవితానుభవాన్ని, సామాజిక జీవన సంబంధాలను జ్ఞానగమ్యాలను కథల నెపంతో

స్పష్టం చేయాలని ఆశిస్తాడు. జీవన గమనంలో ప్రతి అనుభవం ఒక్కొక్క మైలురాయి. ఆ అనుభవాలలో మనిషి తాను పొందిన స్పందనను పరులతో పంచుకుంటూ కథలు కథలుగా చెప్పాలనుకుంటాడు. ఒక ప్రధాన వ్యక్తిని ఆలంబనగా పెట్టుకొని జీవితానుభవాలను వాటి సత్యాసత్యాలను నూతన పంథాలో కథ అల్లటం కోసం ప్రధాన కథను కేంద్రంగా చేసుకొంటాడు. అంతేగాక ఆ కథలో మరికొన్ని అవాంతర కథ లుంటాయి. ఒక అనుభవం కేంద్రంగా మరికొన్ని అనుభవాలు జీవితంలో ఎలా చోటుచేసుకొంటాయో అలాగే కథలో కథలుంటాయి.

భారత, రామాయణ, భాగవతాది ఇతిహాసపురాణజ్ఞానం రకరకాలుగా మౌఖిక లిఖిత రూపాలలో అంది వస్తూన్న సమయంలో మానవులకు ఆ కథలు మళ్ళీమళ్ళీ ఎంత వినాలనిపించినప్పటికి కూడ నూతన అనుభవాలతో కూడిన కథలు కావాలనిపించటం సహజం. మానవుల ఈ ఆకాంక్షను సంతృప్తి పరచటానికే కథాకావ్యాలు పుట్టాయి. అసలు ఇతిహాస, పురాణ కథలకు సమాంతరంగా సమకాల జన జీవనం ప్రతిఫలించిన అనేక కథలు అనేకమంది అనుభవాల నుండి పుట్టి ఉంటాయి. ఇలా మౌఖికంగా జనజీవితంలో ఉన్న కథలు లిఖితరూపంలోకి కథాకావ్యరచనలుగా రావటం కేతన దశకుమార చరిత్రతో ప్రారంభమైంది. మంచన కేయూర బాహు చరిత్ర, జక్కన విక్రమార్క చరిత్రం, అనంతుని భోజరాజీయం, వెన్నెలకంటి షోడశకుమార చరిత్ర, దూబగుంట నారాయణ పంచతంత్రము, భైరవరాజు వేంకటాద్రుల, అయ్యలరాజు నారాయణామాత్యుల హంసవింశతి, పాలవేకరి కదిరీపతి-శుక సప్తతి, పంచవింశతి ఇత్యాది కథా కావ్యాలు పుంఖాను పుంఖులుగా రాగలిగాయి.

అసలు ఈ కథా కావ్యాలు 15 శతాబ్దములోనే ఎక్కువగా రావటానికి కారణం అప్పటికి రాజ్యం బాగా బలపడి రాజు అనేకుడు అనే భావన స్థిరపడటమే. కవి పండిత పోషకుడైన రాజు తన ఆధిక్యతను ప్రచారం చేసుకోవటానికి, జనంలో వ్యాపింప చేయటానికి సాహిత్యాన్ని సాధనంగా వాడుకోవటం కథాకావ్యాల రచనకు ప్రోద్బలమైంది.

అటు రాజు వ్యక్తిగతంగా బలపడాలనుకున్నాడు. తన రాజనీతిజ్ఞతతో, పరాక్రమంతో రాజకీయంగా బలపడుతూ అందరిచేత గుర్తింపు పొందాలనుకొని కావ్య రచనకు ప్రోత్సాహ మివ్వగా, ఇటు కవికూడ తన ప్రతిభాపాటవాన్ని కథా కథన నైపుణ్యాన్ని నిరూపించుకునే అవకాశం కల్గిన క్రొత్త కథలతో ఎక్కువగా

రాజుల చరిత్రను చెప్పటం ప్రధానంగా పెట్టుకుని రచన సాగించాడు. జన జీవితంలోని అనుభవాలకు అద్దంపడుతూ విశిష్టపంథాలో నూతనోత్సాహాలను కల్గించే విధంగా కథలన్నీ కూర్చి తన కథాకథన పాటవంతో కావ్య రచన చేశాడు.

## 1.4. రాజ్య స్వభావం :

'సింహాసన ద్వాత్రింశిక' కావ్యము పేరునుబట్టి రాచరిక వ్యవస్థను ప్రతిబింబించేదని అర్థం అవుతుంది. సింహాసనం రాజ్యాధికారి అధిష్ఠించే ఉన్నతాసనం. రాజు, రాజెక్కిన సింహాసనం రెండూ కలిసి రాజ్యం యొక్క అదుపుచేసే శక్తిని వ్యక్తం చేస్తాయి.

రాజ్యం ఒక వర్గంమీద మరొక వర్గం కొనసాగించే ఆధిపత్యానికి, దోపిడికి అవసరమైన ఒక నిర్బంధపూరిత సాధనం అన్న విషయం సామాజిక పరిణామ చరిత్రను అధ్యయనంచేస్తే అర్థం అవుతుంది. సమాజ పరిణామక్రమంలో మానవజాతి ఆహార సేకరణ చేస్తూ గుంపులు గుంపులుగా సంచరిస్తూన్న దశలో వర్గ సమాజం లేదు. ఉత్పత్తి శక్తులు చెప్పుకోతగ్గట్లు అభివృద్ధి చెందకపోవటం అందుకు కారణం. కాని పశు పోషక గణవ్యవస్థ వ్యవసాయిక వర్గవ్యవస్థగామారిన దశలో ఈ అదనపు ఉత్పత్తి ఎక్కువవుతూ ఈ అదనపు ఉత్పత్తిని చేజిక్కించుకునే గణముఖ్యులు బలమైన పాలకవర్గంగా స్థిరపడటం జరిగింది. ఆహారంగా ఉన్న పశువులను వ్యవసాయకోసం ఉపయోగించటంతోనే ఎక్కువవుతున్న ఉత్పత్తి ముఖ్యంగా లోహపు పనిముట్లు కనిపెట్టిన తర్వాత మరింత అధికమైంది. నాగలి వంటి ఉత్పత్తి సాధనాలు అభివృద్ధి చెందుతూ వాటిమీద వ్యక్తిస్వామ్యం తద్వార పని నిపుణత పెరుగుతున్న దశలో ఏర్పడిన ఉత్పత్తి సంబంధాలు వ్యక్తిగత ఆస్తి భావనను అభివృద్ధి చేశాయి. అది మగవాని సంతానానికే వారసత్వపు హక్కునిచ్చింది. దానితో కుటుంబంలో ఆస్తి పోగుబడింది. ఆస్తిలోని హెచ్చు తగ్గులతో సాంఘిక నిర్మాణంలో కూడ మార్పు వచ్చింది. వ్యక్తిగత ఆస్తివల్ల వ్యక్తి ప్రాధాన్యత కూడ పెరిగింది. వంశక్రమానుగతమైన కులీన వ్యవస్థకూ రాచరికానికీ ప్రాతి పదికలు ఏర్పడ్డాయి. వ్యక్తి ఆస్తి పెరిగేకొద్ది స్పష్టమైన రూపాన్ని తీసికొని వర్గసమాజం సజావుగా కొనసాగించాటానికి ఆవిర్భవించిన కొత్త వ్యవస్థ రాజ్యం. సుస్థిరంగా ఉండే ప్రదేశం మీదనూ స్థానికంగా స్థిరపడిన ఆస్తి మీదనూ ఏర్పరచబడిన పాలనా వ్యవస్థ ఇది[21]. సంపదల నిరంతరాభివృద్ధికి సమాజం యొక్క ఆమోదముద్రవేసి సమాజంలో కొత్తగా తలయెత్తుతున్న వర్గవిభజననే కాకుండా,

అస్తిపరుల వర్గం ఆస్తిలేని వర్గాలను దోచుకొని పాలించే హక్కును కూడ శాశ్వతంగా సాగనిచ్చే సంస్థగా రాజ్యం ఆవిర్భవించింది[22]. గణ సంఘంలోని సామూహిక పద్ధతులకు వ్యతిరేకంగా వ్యక్తులు పోగుచేసుకున్న ఈ కొత్త సంపదలను కాపాడి గతంలో ఎంతో చులకనగా చూడబడే వ్యక్తిగత ఆస్తిని పవిత్రమైనదిగా స్థిరపరచి. ఆ పవిత్రతను కాపాడటమే మానవ సమాజంయొక్క ప్రధాన గమ్యంగా ప్రకటించే పాలనా వ్యవస్థ ప్రాదేశికార్థంలో రాజ్యంగా రూపుదిద్దుకుంది.

ప్రజానీకం కన్నా భిన్నమైన ప్రభుత్వ బలగం ఉండటమనేది రాజ్యం యొక్క ప్రధాన లక్షణం. అంతకుముందటి గణవ్యవస్థలో కూడ ప్రభుత్వ భావన ఉంది. ఐతే అక్కడ ప్రభుత్వ వ్యవస్థ గణజనము యొక్క ప్రత్యక్ష సంబంధాలలో పరిణమించినదిగా కనబడుతుంది. ఆ ప్రభుత్వానికి భూభాగ పరిమితులులేవు. గణంలోని జనం మధ్య అంతర్గత సంబంధాలలోనూ, వివిధ గణాల మధ్య ఉండే సంబంధాలలోనూ విధి నిషేధరూపమైన నియమావళిగా ఆ నియమాల ఆచరణగా ప్రభుత్వవ్యవస్థ ప్రాథమిక రూపం కనబడుతుంది. గణప్రముఖులు, నైతిక నాయకులు ఉన్నప్పటికి గణజన సమూహాల ప్రత్యక్ష భాగస్వామ్యం ఆ ప్రభుత్వ వ్యవస్థలో ఉండేది. సొంత ఆస్తి ఏర్పడి భూమి ప్రధాన ఉత్పత్తి మాతృకగా గుర్తింపును పొందటంతో భూభాగాలనుబట్టి అందులో ఆస్థి సంబంధాలలోనూ, ప్రాంతీయ సంబంధాలలోనూ గల వ్యక్తులతో రాజ్యం ఏర్పడటం ప్రాచీన సమాజానికి ముగింపు[23]. ఈ రాజ్యాలలో ప్రభుత్వం అనేది వ్యక్తి సమూహాలమధ్య ప్రత్యక్ష సంబంధాలలో కాక ప్రాదేశిక సమూహాల మధ్య సంబంధంగా స్థిరపడుతుంది. ఫలితంగా ప్రజలకంటే భిన్నంగా పైనుంచి ప్రజలను పరిపాలించే వివిధ సంస్థలు ఈ రాజ్యంలో చోటుచేసుకుంటాయి. అంతకుముందు గణంలో ప్రముఖులుగా ఉన్న వాళ్ళు ఈ సంస్థలలోకి ప్రవేశించటం జరిగి, అదనపు ఉత్పత్తులను చేజిక్కించుకున్న వాళ్ళంతా ఒక నూతన వర్గంగా బలపడటం పరిపాలనలో కులీనతకు ప్రాధాన్యత ఏర్పడటం జరిగింది[24].

అందుచేతనే అది సమాజంలో మంచి శక్తి, ఆర్థికబలం ఉన్న వర్గంయొక్క రాజ్యంగానే ఉంటుంది[25]. ఈ రాజ్యం తన అధికారాన్ని చెలాయించడానికి ప్రభుత్వ యంత్రాంగంగా వివిధ రూపాలను తీసుకుంటుంది. శాసన, సైనిక, న్యాయవ్యవస్థలు అందులో భాగమై వ్యక్తిగత ఆస్థి తండ్రినుండి కొడుకుకు సంక్రమించినట్లుగానే భూమి ప్రాతిపదికగా ఏర్పడినరాజ్యం, రాజ్యావ్యవస్థ తద్వారా చెలా

యించే అధికారం కూడా వారసత్వంగా తండ్రి నుండి కొడుకుకు సంక్రమిస్తాయి [26].

రాజ్యం ఒక బలమైన వ్యవస్థగా పరిణమించే క్రమంలో భారతదేశంలో అది స్థిరపడటానికి వర్ణ వ్యవస్థ తోడ్పడింది. వర్ణ వ్యవస్థలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలవారు అంతస్థులవారీ స్థాయిలో ఉంటారు. కులాలు, ఆర్యులు భారత దేశానికి వచ్చిన తరువాత క్రమంగా రూపుదిద్దుకున్నాయి. ఆర్యులతోటి వచ్చిన వేదమంత్రాలు లిపి బద్ధం కాకపోవటమూ, మౌఖిక వారసత్వంగా అందివచ్చే పద్ధతి ప్రాముఖ్యంలోకి రావడమూ పురోహిత వర్గావిర్భావానికి దారితీసింది. అంతకు ముందటి గణవ్యవస్థలో ఆహారసేకరణ పంపిణీ విషయంలో కర్మకాండను నిర్వహిస్తూ గణప్రముఖులలో పురోహిత వర్గంగా వున్న వాళ్ళు కూడా వీళ్ళలో చేరటంలో బ్రాహ్మణ వర్ణం పూర్తిగా ఏర్పడింది [27]. అంతకుముందటి గణవ్యవస్థలో సైనికులు, గణప్రముఖులు వ్యక్తిగత ఆస్తిని చేజిక్కించుకునే ప్రయత్నంలో గణ సంబంధాలను తెంచుకొని తమని తాము 'రాజులు'గా, క్షత్రియులుగా భావించుకున్నారు. ఉత్పత్తులను పంపకం చేసుకునే సమయంలో అదనపు సంపదను గణముఖ్యులు, పంపకానికి సంబంధించిన కర్మకాండను నిర్వహించే పురోహిత వర్గంతో పంచుకోవటం అనివార్యం అయింది. వ్యక్తిగత ఆస్తిని ఏర్పరచుకుంటున్న గణముఖ్యులు దానిని రక్షించుకోవటం కోసం వర్ణవ్యవస్థను సమర్థించి దాన్ని ప్రబోధం చేసే బ్రాహ్మణ వర్ణానికి కొంత సంపదను ముట్టచెప్పటం ఒక చారిత్రక అవసరమైంది. అటు పశు సంపదలోగాని, ఇటు వ్యవసాయ ఉత్పత్తుల్లోగాని గణాల అవసరాలకు మించిన అదనపు సంపద సమకూరుతూ ఉన్న సామాజిక దశలలో ఆ అదనపు సంపద ఒకవైపు గణముఖ్యుల, పురోహిత వర్గాల వ్యక్తిగత ఆస్తిగా మారటమే కాకుండా అసలా సంపదలు లేని గణాలతో మారకం రావటం కూడ సామాజికావసరం అయింది. ఈ క్రమంలో అంతవరకు వ్యవసాయ రంగంలో ఉండి సంపదను సృష్టించిన వాళ్ళనుండి కొంతమంది నిడివడి మారక కార్యకలాపాలలోనికి ప్రవేశించారు. అలా ప్రవేశించిన వాళ్ళే ఉత్పత్తితో సంబంధం లేని నూతనవర్గం అయ్యారు. వీళ్ళతోనే తర్వాత వైశ్యవర్గం రూపొందింది [28]. వ్యవసాయక కార్యకలాపాలు సాగించే ఉత్పత్తి శక్తులు, ఆటవికులు కలిసి శూద్రులుగా ఏర్పడ్డారు. చాతుర్వర్ణవ్యవస్థ పూర్తి రూపాన్ని తీసుకుంది. 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః'[29] అని శిరోస్థానంలో మేధావి వర్గానికి చెందినవారుగా బ్రాహ్మణులను, భుజస్థానంలో పరాక్రమానికి

చెందినవారుగా క్షత్రియులను, ఊరుస్థానంలో కూర్చుని వ్యాపారం చేసేవారుగా వైశ్యులను, పాదస్థానములో ఉంచి నీచపు పనులకు కేటాయించబడిన వారుగా శూద్రులను నిలిపి, వర్ణ వ్యవస్థకు ఒక మూర్తిమత్వము నాపాదించి అంతస్థులవారి ఆధిపత్యానికొక వ్యాఖ్యానం చేయటం జరిగింది. సామాజిక ఉత్పత్తులతో పైమూడు వర్ణాలవారికి కొద్దిపాటి తేడాలతో ఎవరి వాటాలు వారికి ఉన్నాయి. అటు వ్యవసాయ రంగంలోనూ, ఇటు వృత్తిపనులలోనూ తమ భౌతిక శ్రమద్వారా అపారమైన సంపదను సృష్టించే శూద్రులు మాత్రం ఆ సంపదమీద ఏ అధికారం లేనివాళ్ళయి నారు. పై మూడు వర్ణాలవారిలో ఎవరో ఒకరిని ఆశ్రయించి సేవ చేసుకుంటూ బ్రతకటం వారి ధర్మంగా ప్రబోధించటం జరిగింది ఈ ప్రబోధ కార్యక్రమాన్ని కర్మ సిద్ధాంత ప్రాతిపదికగా నిర్వహించటంద్వారా బ్రాహ్మణులు రాజ్యానికి, రాజుకు ప్రియమైనవాళ్ళగా అయ్యారు. వర్గ వైరుధ్యాలు తీవ్రతరం కాకుండా చూడటానికి ఆస్తిత్వంలోకి వచ్చిన రాజ్యం భారతదేశంలో వర్ణవ్యవస్థను నిలబెట్టేదిగా కూడ అయింది. అందుకనే భారతీయ రాజులు అందరూ వర్ణాశ్రమ ధర్మ సంరక్షకులుగా చరిత్రలోనూ, పురాణేతిహాస సాహిత్యంలోనూ కీర్తించబడ్డారు.

ఈ విధంగా రాజ్యం బలపడి వర్ణసమాజ పరిరక్షకుడుగా రాజు బలపడు తున్న దశను కథేతివృత్తం ద్వారా సూచించిన కావ్యం 'సింహాసన ద్వాత్రింశిక'లో రాజు సింహాసనం ఎక్కటం ప్రధాన విషయం. వర్ణవ్యవస్థ సహాయంగా ఏర్పడిన వర్గసమాజంలో అంతస్థులవారి ఆధిపత్యం ఎట్లా కొనసాగిందో స్పష్టం అవుతూ రాజ్యనిర్వాహణకు అదే ప్రధాన కారకంగా ఎలా ఉందో ఈ కావ్యం స్పష్టం చేస్తుంది. ఎటువంటి అర్హతలున్న వ్యక్తి సింహాసనం ఎక్కాలో చెప్పటంగా ముప్పది రెండు బొమ్మలు విక్రమార్కుడనే రాజు యొక్క గుణగణాదులను ముప్పదిరెండు కథలుగా ఈ గ్రంథంలో చెప్తాయి.

'సింహాసన ద్వాత్రింశిక'లోని కథలకు భారతీయ సమాజం రాజునుగూర్చి రాజ్యవ్యవస్థను గురించి ఏ ఆదర్శస్థితిని భావిస్తున్నదో చెప్పటం ముఖ్య ఉద్దేశం[30] సింహాసన ద్వాత్రింశిక భారతీయమైన ఆదర్శ రాజ్యవ్యవస్థను గురించి, రాజును గురించే చెప్పే ఉద్దేశంగల కావ్యం అనటంలో ఎటువంటి సందేహము లేదు. ఆ మేరకు సింహాసన ద్వాత్రింశికలోని వివిధ కథలు రాజును సాహసౌదార్యా గుణ సంపన్నుడుగా చిత్రించి ఉదారగుణాలు లేనివాడు రాజు కాలేదని నిర్దేశించాయి. సాహిత్యం సమాజ ప్రతిఫల స్వరూపం కనుక ఈ సాహిత్య ఆధారాన్ని పట్టుకొని 15వ శతాబ్దమునాటి కొరవి గోపరాజు ఆదర్శ రాజ్యవ్యవస్థను ఈ గ్రంథంలో

ఆవాహన చేశాడనుకోకూడదు. ఎందుకంటే 15 శతాబ్దంనాటికి రాజ్యం పరస్పర యుద్ధాలలో ప్రాదేశిక పరిమితులను పెంచుకోవటం లక్ష్యంగా పనిచేస్తూ అంతిమంగా ప్రజాపీడన వ్యవస్థగా పరిణమించినదన్నది చారిత్రక సత్యం. ఈ పరిస్థితులలో వచ్చిన సాహిత్య రచనగా సింహాసన ద్వాత్రింశిక– రాజ్యాన్ని సమర్థించే కావ్యంగా రావటం, ఆ అధికార వర్గ సంస్కృతిని ప్రతిబింబించటం సహజం[31]. అయితే లభిస్తున్న ఈ కథాసాహిత్య సమాచారాన్నే మూలాధారంగా చేసుకొని చారిత్రక భౌతికవాద దృక్పథంనుండి రాజ్యంయొక్క వర్గ స్వభావాన్ని అది ఎట్లా ప్రతిఫలించిందో చెప్పవచ్చు. నిజానికి రాజ్యస్వభావం ప్రజలను అదుపులో ఉంచటం అని సామాజిక పరిణామక్రమం స్పష్టం చేస్తున్నది. ఐతే అదుపుచేయటం బలవంతంగా కాక, సామాజిక సాంస్కృతిక భావజాల వ్యవస్థద్వారా ప్రజలు తమంతట తాము లొంగి ఉండేటట్లు చేయటంమీద రాజ్యం యొక్క శాంతిభద్రతలు ఆధారపడి ఉంటాయి. అసమానతలు, వర్గసమాజం ఉన్నప్పుడు ఒకసారి కాకపోతే మరో సారైనా తిరుగుబాట్లు రాక తప్పదు. అవి రాకుండా ఉండటానికి, ఎప్పుడూ ప్రజలను ఒకవిధమైన భయంలో ఉంచడానికి, 'నావిష్ణుః పృథ్వీ పతిః' అని రాజును దైవాంశ సంభూతుడని చెప్పి ప్రజలలో అతనిపట్ల భక్తి విశ్వాసాలను పెంపొందింప చేయటం జరిగింది. ప్రజలను లొంగి వుండేటట్లు చేయటంకోసమే రాజు సాహస కృత్యాలు చేస్తాడు. ప్రజలకంటె తాను చాలారకాలుగా అధికుడని, ఏది పడితే అది చేయగల సమర్థుడని నిరూపించుకోవటం రాజు యొక్క అస్థిత్వానికి అవసరం.

సాంస్కృతికంగా సింహాసనం అంటే భయం ఏర్పడేటట్లు చేసి అంతర్గత తిరుగుబాట్లు లేకుండా చేసుకోవాల్సిన పరిస్థితులు ఆంధ్రదేశంలో 15వ శతాబ్దం నాటికి ఏర్పడ్డాయి. రాజులు తమ రాజ్య పరిధులను పెంచుకోవటానికి పరస్పరం సంఘర్షిస్తున్న పరిస్థితులలో, రాజుకు రాజ్య ప్రజలనుండి తిరుగుబాటు భయం లేకుండా చేయటం అవసరం. ఆ అవసరాన్ని తీర్చటం ధర్మంగా భావించి రాజా స్థానాలలో గౌరవ సత్కారాలందుకుంటున్న పండితకవులు సహజంగా పోషక వర్గాన్ని బలపరచేటందుకే ముందుకు వచ్చారు. 'భువనాధీశ్వరుని సేవించి ఆతని ప్రాంగణమున కవులు, భటులు ఉండి కొలిచిన విధానాన్ని వర్ణించటం (11–128) ద్వారా సింహాసనద్వాత్రింశిక ఈ విషయాన్నే నిరూపించింది. భువనాధీశ్వరుని తత్పరమతితో పూజించే కవులు ఆ రాజుల సాహసాన్ని, దానగుణాలదును కీర్తిస్తూ కథలు, కథలుగా వర్ణిస్తూ కావ్యాలు వ్రాయటం సహజం. ఆ క్రమంలోనే రాజుకు ఎదురు అనేది లేకుండా చేయాల్సిన సాంస్కృతిక కర్తవ్య నిర్వహణలో భాగంగా

కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికను రచించి ప్రజల కోసమే రాజ్యాన్ని పరిపాలిస్తున్నట్లు, అందుకోసం రాజు ఎటువంటి సాహసకృత్యాలకైనా వెనుకాడనట్లు ఔదార్యాది వితరణ గుణాదులతో ప్రవర్తించినట్లు చిత్రించటం జరిగింది. సింహాసన ద్వాత్రింశిక ద్వారా రాజ్యవ్యవస్థ, రాజు స్వభావం అర్థం అవుతుంది. అసలు రాజు స్వభావం భూమిని ఆక్రమించుకొని వీలయినంతకాలం ఆ పదవిని అంటిపెట్టుకొని ఉండాలనుకోవటమే కాబట్టి విక్రమార్కుడు మహాకాళున్ని గురించి తపస్సుచేసి 'అమరత్వం' (1-106) కావాలని అడిగాడు. కాని 'పుట్టిన మనిషి గిట్టక తప్పదు' కనుక అది కూడనిపని అని మహాకాళుడనగానే 'ఒక దివసంబెక్కుడుగా నొకయేడగు పిన్న పాపకుదయించిన బాలకుని చేతగాని రాజ్యాపక యుండను' (1-107) వేడుకున్నాడు. అలాంటి చిన్న బాలికకు కొడుకు పుట్టటం అసాధారణ విషయంకాబట్టి తనకు వీలయినంతవరకు చావుండదనీ తాను ఎన్నాళ్ళయినా రాజ్యం ఏలవచ్చునని అనుకున్నాడు. కాని మహాకాళుడు 'వెయ్యేడులు రాజ్యసుఖం బయ్యెడు బొమ్మ'నెను (1-109) అక్కడ కాళుడు విక్రమార్కుడు రాజ్యంకోసమే బ్రతకాలనుకున్నట్టు చక్కగా గ్రహించగలిగి 'రాజ్యాధికారం వహించే కాలాన్ని మాత్రమే వరంగా ప్రసాదించాడు. విక్రమార్కుడు తను పొందిన వరాన్ని మంత్రియైన భట్టికి చెప్పగా భట్టి కూడ విక్రమార్కుని శాశ్వత రాజ్యాధిపత్యకాంక్షను గ్రహించి కాళుడిచ్చిన వరంతోనే అవనంగా ఇంకొక వేయేండ్లు (వెరసి 2000 సం.లు) పరిపాలించే ఉపాయం చెప్పటం, దానిని రాజు 'హితవచనంగా' (1-112) తీసికోవటం జరిగింది. ఇక్కడ విక్రమార్కునకు సింహాసనం మీదనున్న వ్యామోహం, రాజ్యకాంక్ష స్పష్టంగా తెలుస్తున్నాయి.

రాజ్య కాంక్ష రాజ్య విస్తరణకు దారితీస్తుంది. విశాల భూభాగాలను ఆక్రమించుకుంటూ, రాజ్యంయొక్క ప్రాదేశిక పరిమితిని పెంచుకుంటూ పోవటం ఈ క్రమంలోనే జరుగుతుంది. ప్రాదేశిక పరిమితి పెరిగేకొద్ది పాలనావ్యవస్థలో రాజుకు ప్రజలకు మధ్య వివిధ స్థాయిలలో సామంతరాజులు ప్రవేశించటం జరుగుతుంది. కావ్యంలో 'విక్రమార్కుడు సామంతులను గెల్చి' (1-105) అని చెప్పటం దీన్నే సూచిస్తుంది. చాళుక్యుల కాలానికి అభివృద్ధి చెందిన ఈ భూస్వామ్య సామంత వ్యవస్థలో బ్రాహ్మణులు కూడ సైనిక సంస్కృతిలో భాగస్వాములు కావడం జరిగింది. ఈ భూస్వామ్య సామంత రాజ్యవ్యవస్థను పటిష్టం చేసుకుంటూ రాజు సార్వభౌమాధికారం స్థిరపడటం సింహాసన ద్వాత్రింశిక కథలలో స్పష్టం అవుతుంది. విక్రమార్కుడి సాహసకృత్యాలు అంతిమంగా సామ్రాజ్య విస్తృతికి

తోడ్పడినట్లు రెండవ, మూడవ, పదిహేనవ, ముప్పదవ బొమ్మలు చెప్పిన కథలు సూచిస్తాయి.

రెండవ బొమ్మ చెప్పిన కథలో ఒక బ్రాహ్మణుడు చిత్రకూటపర్వతంమీద వేయేండ్లు హోమము చేసిననూ ఫలసిద్ధిని పొందలేదు. ఆ విషయం తెలుసుకున్న విక్రమార్కుడు వెళ్ళి తన తలను హోమగుండంలో వేయబోగా దేవత మెచ్చి వర మివ్వటానికి సిద్ధమవుతుంది. కాని విక్రమార్కుడు తనకు బదులు ఆ వరాన్ని బ్రాహ్మణునకు ఇవ్వమంటాడు. అప్పుడా దేవత బ్రాహ్మణునకు చతుశ్శతవత్సర భోగ్యమైన మహిపతిత్వమును (2-100) వరముగా ఇచ్చింది. అలాగే పదిహేనవ బొమ్మ చెప్పిన కథలో తప్తతైల కటాహమున దుమికి ఆత్మాహుతి చేసుకున్న విక్రమార్కుని సంజీవనీ కన్య తిరిగి బ్రతికించి తనను, తన ఆధీనంలో ఉన్న రాజ్యాన్ని పొందమనగా విక్రమార్కుడు ఆ కన్యను, ఆ రాజ్యాన్ని తనతోపాటు కూడా వచ్చిన విప్రసుతునకిచ్చాడు. ఈ రెండు కథలను బట్టి చూస్తే విక్రమార్కుడి సాహస కృత్యాల నెపంతో రాజ్యాన్ని విస్తరింప చేసుకోవటం రాజుయొక్క సహజ లక్షణంగా అర్థం అవుతుంది. విస్తృతమైన రాజ్యాన్ని, విశ్వాసపాత్రులైన వారి ఆధీనంలో ఉంచి, సార్వభౌమాధికారాన్ని స్థిరపరచుకునే క్రమంలో విక్రమార్కుడు తాను పొందాల్సిన, పొందిన భూభాగాలను ఆయా బ్రాహ్మణుల ఆధిపత్యంలో వుండేట్లు చేశాడు. వర్గసమాజాన్ని నిలబెట్టడంలో సామరస్యపూర్వకంగా ప్రజలను లొంగి ఉండేటట్లు చేయగల్గిన బ్రాహ్మణ పక్షాన్ని అధికారవర్గంలో చేర్చుకోవటం తాను సంపాదించిన రాజ్యాన్ని విక్రమార్కుడు బ్రాహ్మణుల అనుభవానికి ఇచ్చి వేయటంలో స్పష్టమవుతుంది. అంతస్థులవారి ఆధిపత్యంలో రాజ్య అస్థిత్వానికి బ్రాహ్మణుడు, మంత్రి వీరిద్దరూ ప్రాణభూతులనే విషయాన్ని ప్రథమాశ్వాసంలోని బహుశృతునికథ వ్యక్తం చేస్తుంది. విక్రమార్కుని సింహాసనాన్ని తవ్వి తీయించిన తర్వాత దానికి శాంతి చేయమని చెప్పిన మంత్రిని భోజుడు పొగుడుతున్నప్పుడు ఆ మంత్రి మంత్రులెప్పుడూ రాజు క్షేమాన్ని కాంక్షిస్తూ అందుకోసం అవసరమైతే రాజాజ్ఞను త్రోచియు త్రోవక ఉపాయంతో ప్రవర్తిస్తూ రాజుకు సహాయ భూతులుగా ఉండాలని చెప్తూ అందుకు ఉపబలకంగా బహుశ్రుతుని కథను చెబుతాడు.

బహుశ్రుతుడను మంత్రి రాజసభలో కూడా భార్యను వదిలి పెట్టలేని నంద రాజుయొక్క స్త్రీ లోల్యాన్ని పోగొట్టటంకోసం రాజపురోహితునిచేత రాణి చిత్ర పటమును వేయించి కొలువులో ఉంచేటట్లు చేస్తాడు. ఆ చిత్రపటములో రాణి కుడి తొడమీద పుట్టుమచ్చ ఉండటం చూచి, దానికై రాజు, పురోహితున్ని, అనుమా

నించి అతనికి మరణశిక్ష వేస్తాడు. కాని మంత్రి అది తొందరపాటు నిర్ణయమని భావించి రాజు కూడా ఆ విషయాన్ని గుర్తించే వరకు అతడిని అడవిలో దాచి ఉంచుతాడు. ఒకరోజు నందరాజు కుమారుడు అడవిలోకి వెళ్ళి ఎలుగు సహాయంతో పులి బారినుండి తప్పించుకొని కూడ తనకు సహాయం చేసిన ఎలుగును పులికి ఆహారంగా ఇస్తాడు. దానితో కోపంవచ్చిన ఎలుగు అతనిని ప్రతి మాటకు సమాధానంగా 'ససేమిరా' అని తిరుగుతూఉండమని శపిస్తుంది. అతడు మామూలు మనిషి అవ్వాలంటే అతడు చేసిన ఆకృత్యాన్ని తెలిపేటట్లు ఎవరైనా' ససేమిరా' అనే నాల్గు అక్షరాలు వచ్చేటట్లు నాల్గు పద్యాలు చెప్పాలని షరతుపెడుతుంది. ఆ పద్యాలు చివరికి శారదానందుండే తనను రాజు గుర్తించకుండా బాలిక గొంతుతో యవనికాభ్యంతరం నుండి చెప్పగా రాజకుమారుడు తిరిగి మామూలు మనిషి అవుతాడు. అప్పుడు రాజు శారదానందుడి దివ్యజ్ఞానాన్ని గుర్తించి అంతకుముందు తాను శారదానందుని అనుమానించినందుకు పశ్చాత్తప్తుడౌతాడు. అతనిని క్షమించ మని వేడి అతడిని తన కొలువులోకి తెచ్చుకుని గౌరవస్థానాన్ని ఇస్తాడు.

ఈ కథలో రాజు భోగపరాయణుడై యున్నను మంత్రి ఉపాయంతో రాజ్య వ్యవహారాలు చక్కబెడుతుంటాడు. బ్రాహ్మణుని కివ్వవలసిన గౌరవం ఇవ్వకపోతే రాజుకు కష్టాలు తప్పవని, రాజును సాధ్యమైనంతవరకు కష్టాలబారి పడకుండా వివేకవంతుడైన మంత్రి జాగ్రత్తపడుతుంటాడని నిరూపించటమే ధ్యేయంగా కన్పడు తుంది.

ముప్పదవ బొమ్మ చెప్పిన కథలో గారడీ విద్యా ప్రదర్శనానంతరము పాండ్యరాజు మంత్రులు (11-172) విక్రమార్కునకు కానుకలు తీసికొచ్చిన విషయముంది. ఆ పాండ్య భూపతులు విక్రమార్కుడ్ని జనలోక నాయకుడిగా కీర్తించి తమదేశంమీద అతను సాగిస్తున్న దండయాత్రను మానటంకోసంగాను ఎనిమిదికోట్ల దీనారాలు, 93 ముత్యాల కావళ్ళు, 300 గుర్రాలు, 50 ఏనుగులు మొదలగువాటితోపాటు 'నూష్వవ వారసతులను' కప్పంగా సమర్పించారు (11-172). అంటే రాజులు దండయాత్రలద్వారా రాజ్యాల ప్రాదేశిక పరిమితిని పెంచు కోవటానికి ఎంత తహతహ పడుతున్నారో, ఆ క్రమంలో సామంతరాజ్య వ్యవస్థను ఎట్లా అభివృద్ధి చేస్తున్నారో, తమ సార్వభౌమాధికారాన్ని ఎలా స్థాపించుకుంటు న్నారో స్పష్టం అవుతుంది.

సామంతరాజ్య వ్యవస్థగాని, దానిమీద ఆధారపడ్డ సార్వభౌమాధికారంలోగాని

స్థిరత్వం తక్కువ. రాజులు పరస్పర ఆహరణోద్యోగ ప్రయత్నాలలో సార్వ భౌమాధికారం అనేది చేతులు మారటం, బలవంతుడికి బలహీనుడైన రాజు భయ పడటం సామంత రాజ్యవ్యవస్థలో సహజం. మూడవ బొమ్మ చెప్పిన అవాంతర కథయైన గౌళికుని కథ ఇందుకు నిదర్శనంగా ఉంది. తాను సాక్షాత్తు కృష్ణున్నేనని చెప్పుకున్న గౌళికుణ్ణి అల్లుడిగా పొందిన భీమసేనుడికి భయపడి ఇరుగుపొరుగు రాజులు 'గర్వముమాని వీనిగొలువందగునంచు' భయంతో గుర్రాలను, ఏనుగులను, కన్యలను కప్పాలుగా (2-131) సమర్పించారని చెప్పిన విషయం ఈ విధమైన సామంత రాజ్య వ్యవస్థా స్వభావాన్ని నిరూపిస్తున్నది.

భూస్వామ్య రాచరిక వ్యవస్థలో భూముల నాక్రమిస్తూ రాజ్యాన్ని విస్తృతింప జేసుకోవటమేకాక, రాజు సకల సంపదలను రాజ్యాధికారంలోనికి తీసుకొనిరావాలను కుంటాడు. విక్రమార్కుడి సాహస కార్యాలలో ఎక్కువభాగం అటువంటి సంపద లను తన ఆధీనంలోకి తెచ్చుకోవటం కోసమే కావటం గమనించవచ్చు. ఎనిమిదవ బొమ్మ చెప్పిన కథలో కాశ్మీర దేశంలో ధనపతి అనే వైశ్యుడు ఒక తటాకాన్ని త్రవ్వించాడు. కాని అందులో నీళ్లుపడటం లేదని 32 లక్షణాలు కల్గినవాడు కంఠ రక్తమిస్తే అది జలపూర్ణం అవుతుందని కంఠరక్తమిచ్చిన సాహసకుడికి 'సప్తకోటి మూల్యతప్తకాంచన ప్రతిమలేడు అతడి పాలుసుమ్ము' (4-86, 87) అని అంబర వాణి చెప్పిన మాటలను చారులద్వారా తెలుసికొని విక్రమార్కుడు అక్కడకు వెళ్తాడు. అక్కడ సూర్యాస్తమయాన్ని వర్ణిస్తూ కవి 'గగన రత్నమపుడు రత్నా కరమున గలిసె' (4-96) నను విషయాన్ని 'సొమ్ము వానిని మణిచేరు సొమ్ము నాగ' అనే మాటల్లో చెప్తాడు. అంటే ఇక్కడ కవికి రాజు దేశంలోని సంపదకంతా అధిపతి అను విషయం తెలుసునని, మళ్ళీ ఇప్పుడు తన సాహసకృత్యం ద్వారా విక్రమార్కుడు 'సప్తకోటి మూల్య తప్త కాంచన ప్రతిమ లేడింటికి హక్కుదారు అవుతాడని, అది సంపద సంపదనే చేరటం లాంటిదన్న భావన అర్థం అవుతుంది.

ఇట్లు రాజ్యాధికారిగా ప్రత్యేకంగా సొంత ఆస్థి కలిగియుండటమేకాక రాజ్యాధి కారిగా దేశ సంపద మొత్తంమీద, రాజు అదుపు ప్రధానంగా ఉండటం, ఆ సంప దను రాజు తన వ్యక్తిగత ఆధికృతను నిరూపించుకోవటానికి ఇష్టం వచ్చినట్లు వాడుకోవటం ఇరువది తొమ్మిదవ బొమ్మ చెప్పిన కథలో కనబడుతుంది. విక్ర మార్కుని దగ్గర కొకడు వచ్చి రత్నపురిలోని మండలనాథుడనే రాజు యొక్క దానధర్మాలను పొగడగా విక్రమార్కుడు అందుకు పైపోటీగా అతనికి కోశాగారము నందలి వస్తుజాలాన్నంతా తీసికొని వెళ్ళమని చెప్పాడు. ఆ వస్తుజాలాన్ని, గజతురగ

గాడుల విలువలను (11-90) ఆ రాజు దగ్గరున్న టెంక 50 కోట్ల 60 లక్షలని (11-103) చెప్తాడు. ఈ విధంగా డబ్బును తృణప్రాయంగా రాజు తన కీర్తి ప్రతిష్ఠలకోసం ఒక వ్యక్తికి దానం ఇచ్చినట్లు ఈ కథలో స్పష్టం అవుతుంది. తన వ్యక్తిగత ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవాలని తాపత్రయపడే రాజు స్వభావం ఈ కథ ద్వారా అర్థం అవుతుంది. అంతేకాక ప్రజలందరిదీ ఐన దేశసంపద వున్న రాజ్య కోశాన్ని రాజు సొంత ప్రయోజనాలకోసం వాడుకోవటం విక్రమార్కుడు తన దుస్స్వప్న శాంతికి కోశాగారంలోని డబ్బునంతా దానధర్మాలకై ఖర్చుపెట్టిన 23వ బొమ్మ చెప్పిన కథలో కనబడుతుంది.

రాజునిసాక్షాత్తుగా 'విష్ణుస్వరూపుడని (1-181) 'విష్ణువుకానివాడు రాజు కాలేడని భావిస్తూ రాజు ఎంతటి సాహసకృత్యాలకైనా భయపడడని చెప్పడం కోసం 'సింహాసన ద్వాత్రింశికలో' చాల కథలు కన్పిస్తాయి. కాకతీయుల పతనానంతరం ఆంధ్రదేశంలో ఏర్పడిన రెడ్డి, వెలమ విజయనగర రాజుల మధ్య తరచు గెలుపు ఓటములు అస్థిరంగా వుండేవి. ఆ విధమైన వ్యవస్థలో రాజకీయంగా రాజు బలంగా ఉన్నాడన్న నమ్మకం ప్రజలలో స్థిరపడితేగాని రాజ్యపాలన సుస్థిరంగా సాగదు. అందుకోసం రాజు అద్భుత శక్తులు కలవాడని ప్రచారం చేయగలగాలి. అనేకాద్భుత కార్యాలు చేసి ప్రజలలో తానెంతటి సాహసవంతుడో నిరూపించు కోవటమే విక్రమార్కుడు చేసిన సాహసకృత్యాలకు సంబంధించిన కథలలో కనబడు తుంది. రెండవ బొమ్మ చెప్పిన కథలో బ్రాహ్మణుని తపస్సు ఫలించుటకు తన తలను హోమగుండము నందు వేయబోవు సాహసకృత్యమేకాక ఏడవ బొమ్మ చెప్పిన కథలో పద్మావతి రత్నోద్భవులను పునరుజ్జీవులను చేయటంకోసం తలతెగ నరుక్కొనే సాహసకృత్యానికి పూనుకొంటాడు విక్రమార్కుడు. అట్లాగే తొమ్మిదవ బొమ్మ చెప్పిన కథలో వారకాంతలవాడలో నున్న 'నరలోకమోహిని' అనే అందగత్తె కోసం వచ్చే విటులను ఒక రాక్షసుడు చంపుతుంటాడు. విద్యార్థియై సంచారానికి వచ్చిన కమలాకరుడు ఆమెను చూచి మోహించినా కూడా రాక్షస భయంతో వెనుదిరుగుతాడు. వచ్చి ఆ విషయాన్ని విక్రమార్కునకు చెప్పగా విక్రమార్కుడు వెళ్ళి, ఆ రాక్షసుణ్ని చంపి ఆ నరలోకమోహినిని విప్రసుతునకిచ్చి కరగ్రహణం జరిపిస్తాడు. ఇక్కడ రాక్షసుడు ప్రజలను భయభ్రాంతులను చేసే ఒక అమానుష శక్తికి ప్రతీక. అటువంటి రాక్షసుణ్ని చంపి నరమోహినిని కాపాడిన వ్యక్తిగా విక్రమార్కుణ్ని చిత్రించేసరికి ప్రజలతని పరాక్రమమునకు మెచ్చుకొని అతణ్ని ప్రజారక్షకుడిగా భావించి అతనిపట్ల భక్తి విశ్వాసాలు కన

ఇపస్తారు. అప్పుడిక రాజుయొక్క పీడన స్వభావాన్ని కలలోకూడ ఊహించలేరు. ఇక్కడ విక్రమార్కుని సాహసపరాక్రమాలు ప్రజల హృదయాలలో నాటుకోవాలని, రాజు ప్రజారక్షకుడన్న అభిప్రాయం స్థిరపడాలని ఈ కథ చెప్పినట్లు అనిపిస్తుంది.

నదిలో పడి కొట్టుకొనిపోతున్న వృద్ధుణ్ని అతని భార్య అభ్యర్థనతో మొసలిబారిన పడకుండా కాపాడిన కథను పదమూడవ బొమ్మ చెప్తుంది. ప్రజలకు సేవచేయటానికి రాజు సంసిద్ధుడుగా ఉంటాడని చెప్పడం ఈ కథ ఉద్దేశ్యం. పదిహేడవ బొమ్మ చెప్పిన కథలో ఒక రాజు విక్రమార్కుడికంటె ఎక్కువగా తాను దానధర్మాలు చేయాలని అందుకు తగిన సంపద పొందటానికి దేవతకు తనను తాను నిత్యబలినిచ్చుకుంటూ ఉంటాడు. ఐతే ఆ రాజును మించిన రాజుగా విక్రమార్కుడు తనను ఆ దేవత కప్పగించుకొని, దేవతా వరముతో 'బలి' ప్రమేయం లేకుండానే అతనికి సంపదలు సమకూర్చి ఆ రాజును నిత్యబలినుండి తప్పించుతాడు. అంతేకాక ఇరువదవ బొమ్మ చెప్పిన కథలో రాజ్యాన్ని పోగొట్టుకున్న రాజకుమారుడికోసం తన పరాక్రమంతో శత్రువులను ఓడించి రాజకుమారుడికి సహాయపడతాడు (8-118). ఈ విధంగా విక్రమార్కుడు చిన్న చిన్న రాజులకు కూడా తన సాహసౌదార్యాది గుణాలతో సహాయపడటం ఈ కథలో కన్పడుతుంది. ఇటువంటి సహాయాలద్వారా ఆ రాజులు తన అదుపు అధికారం నుండి తప్పుకుపోకుండా జాగ్రత్తపడతాడు. సామంత రాజ వ్యవస్థలో సార్వభౌమాధికారం నెరపే రాజు సామంతులు అదుపుమీరి పోకుండా నిరంతరం చేసే ప్రయత్నాలకు ఈ కథార్థం ఒక నమూనా. ఈ విధంగా రాజు తన సాహస విక్రమాలలో అద్భుత కార్యాలతో ప్రజల్ని ఆశ్చర్య చకితుల్ని చేయటం వారికి తెలియకుండానే వారికి రాజంటే భయం ఏర్పడేటట్లు, అధికుడనే భావన స్థిరపడేట్లు చేస్తుంది. ఈ విధంగా భౌతిక వైరుధ్యాలతో తనకంటె క్రిందిస్థాయి రాజులను, ప్రజలను కూడా సామరస్య ధోరణిలో అణిచి వుంచి తనరాజ్యం బలపడేటట్లు చేసుకున్న రాచరికపు వ్యవస్థ ఈ కావ్యంలో కనపడుతుంది. ఈ క్రమంలోనే 'రాజాజ్ఞ' అతిక్రమించటానికి వీల్లేని ప్రత్యేక ప్రతిపత్తి కల అంశం అవుతుంది.

అందువల్లనే 'సింహాసన ద్వాత్రింశిక'లో రాజాజ్ఞ ఎంత తిరస్కరించటానికి వీలులేనిదో ఎన్ని కష్టనష్టాలకైనా ఓర్చుకొని రాజాజ్ఞను విధిగా ఎట్లా నిర్వర్తించాలో ప్రబోధించే కథలు కనబడతాయి. మూడవ బొమ్మ చెప్పిన కథలో విక్రమార్కుడి పనుపున అశ్వమేధయాగానికి రత్నాకరుడైన సముద్రుడిని ఆహ్వా

సించటానికి వెళ్ళి ఎన్నిసార్లు పిలిచినా సముద్రుడు బదులివ్వక పోయినా 'రాజాజ్ఞ విధి' నిర్వహణకై బ్రాహ్మణుడు సముద్రుడు వచ్చే వరకు ఓర్పుతో ఎదురు చూచాడు. వచ్చిన సముద్రుడు అశ్వమేధయాగ కట్నంగా విక్రమార్కుడికివ్వమని ఇచ్చిన నాలుగు రత్నాలు తీసుకొని 'వచ్చిన పని సఫలంబగుటకు హర్షించి' (2-170) వెనుదిరిగివెడతాడు. అప్పటికి యాగము సంపూర్తి అయి దానాలివ్వటం కూడా అయిపోతుంది. రాజాజ్ఞావిధి నిర్వహణకై వెళ్ళిన తాను మంచి భోజనాన్ని, దానధనాన్ని పోగొట్టుకొన్నానే అని ఆ బ్రాహ్మణుడు బాధపడతాడు. 'రాజాజ్ఞావిధి' నిర్వహణలో స్వలాభాలను కూడా పరివారం ఎట్లా వదులుకోవలసి వస్తుందో ఈ కథ ద్వారా సూచించటం జరిగింది.

ఐదవ బొమ్మ చెప్పిన జాంఘికుని కథలో కూడా రాజాజ్ఞను తిరస్కరించ కూడదనే ప్రబోధం కనపడుతుంది. ఒకరోజు విక్రమార్కుడి దగ్గర కొక రత్న వ్యాపారి దూరదేశాల నుండి వచ్చి కొన్ని రత్నాలను ఇచ్చి అతడపికాక తనదగ్గర ఇంకా పది రత్నాలు ఉన్నాయని అతనితోపాటు ఎవరైనా వస్తే వారిని ఇస్తానని అంటాడు. విక్రమార్కుడు ఆ రత్నాలు తీసుకొని త్వరగా రాగలవాళ్ళెవరని అడుగగా జాంఘికుడనువాడు లేచి తాను ఆ రత్నాల వ్యాపారిలో వెళ్ళి ఏడు రోజులలో ఆ రత్నాలు తీసుకొని తిరిగి వస్తానని అంటాడు. అన్నమాట ప్రకారం రత్నాలు తీసుకొని వస్తుండగా ప్రకృతి వైపరీత్యాలను ఎదుర్కొంటూ ప్రయాణంలో కష్టపడతాడు. దారిలో అడ్డంవచ్చిన ఏరుని దాటించేందుకు ఒకడు 5 రత్నాలను ఇవ్వమని అడగగా రాజాజ్ఞమేరకు ఏడురోజుల లోపలనే రాజు కొలువు చేరుకోవచ్చునని జాంఘికుడు తనకు వ్యాపారిచ్చిన 10 రత్నాలలో ఐదింటిని తీసి ఇస్తాడు.

రాజధనాన్ని ఖర్చుపెట్టే సాహసంచేసి అయినాసరే, రాజాజ్ఞను మాత్రం యథావిధిగా నిర్వర్తించాలని జాంఘికుడు భావించినట్లు ఇక్కడ స్పష్టమవుతుంది. ఈ సందర్భంలో అతడు రాజాజ్ఞ 'పూజనీయమని' (3-110) అట్టి ఆజ్ఞకు భంగము కలిగేటట్లు ప్రవర్తించటం 'అయుధం లేనిచావ'ని (3-112) అనుకోవటం రాజాజ్ఞ ధిక్కరించటానికి వీల్లేనిదనే భావాన్ని నొక్కి చెపుతున్నాయి. రాజు ఎంతటి గొప్పవాడో రాజుమాట అంతగొప్పది. రాజు ఆజ్ఞ శాసనం వంటిది. దానిని ధిక్కరించటం అంటే శాసన ధిక్కారం చేయటమే. అది పెద్ద నేరమన్న భావన ప్రజల్లో గాఢంగా నాటుకుపోయేట్లు రాజ్యం చేయగలిగింది. కనుకనే జాంఘికుడు రాజాజ్ఞకు అంత గౌరవమిచ్చి భయభక్తులతో ప్రవర్తించాడు.

ఇరువదితొమ్మిదవ బొమ్మ చెప్పిన కథలోకూడా విక్రమార్కుడి దగ్గరకు ఒకడు వచ్చి రత్నపురిలోని మండలనాథ చంద్రుని దానం పొగడగా విక్ర మార్కుడు ఆ రాజును మించిన దానగుణం చూపాలని తన కోశాగారంలోని వస్తు జాలాన్ని గజతురగాదులతో సహా అతని కివ్వటానికి నిర్ణయించి 'లెంక'ను పిల్చి, అందుకు ఏర్పాట్లు చేయమని చెప్తాడు. అప్పుడు 'లెంక' రాజాజ్ఞను దాటక కోశాగారమంతయు ఖాళీ ఐనాసరే అని మారుమాట్లాడలేదు. ప్రభువుల ఆగ్రహాను గ్రహాలెంత క్షణికాలో తెలిసిన 'లెంక' లెక్క చెప్పాలనుకుంటాడు. కాని విక్రమార్కుడు లెక్క చెప్పవద్దని వారిస్తూ అతనితో 'నా మాటకు అడ్డుపెట్టక ఇచ్చావు అదిచాలు. నీపని అంతే, (11-104) అంటాడు. దానికి సమాధానంగా లెంక రాజాజ్ఞను జవదాట రాదనియు, గొప్పగొప్ప రాజులే విక్రమార్కుని మాటను జవదాటరనియు ఇంక సేవకులు అసలు రాజాజ్ఞను దాటరనియు చెప్తూ 'ఏ ర్తెనను బనిచిన చిత్తగలించదగువు విడి చెప్పినపని మాఱుత్తరమీయక చేసిన నుత్తమ సేవకుడువాడే యుర్వీరమణ' (11-106) అని రాజాజ్ఞను సేవకుడెట్లా శిరసావహించి ఉత్తమ సేవకుడనిపించుకోవాలో చెప్తాడు. అంతేకాక 'ఆజ్ఞదప్పుట పతియాయువు దరపుట' (11-108) అంటాడు. ఈ విధంగా కథలో రాజాజ్ఞను ఉచితానుచితాలు ఆలోచించకుండా విధిగా నిర్వర్తించవలసిందేనని, 'ఆజ్ఞభంగం చేయటం' రాజహత్యానేరమని ప్రతిపాదించి రాజద్రోహం చేయకూడదని ఈ కథ ప్రబోధిస్తుంది.

మొత్తం మీద ఈ కథలన్నీ రాజ్యంలో ప్రాదేశికంగా అంతస్థులవారి భేదాలు ఉండటాన్ని, సార్వభౌమసామంత రాజులసంబంధాలలోనూ, రాజ్యంలో పాలనా వ్యవస్థలో అంతస్థులవారి భేదాలుండటాన్ని రాజు, మంత్రి, పురోహితుడు, లెంక మొదలైన వారి సంబంధాలలోనూ, సామాజిక వ్యవస్థలో అంతస్థులవారి భేదాలుండ టాన్ని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలుగా ఉన్నవారి మధ్య సంబంధాల లోనూ నిరూపించాయి. రాజ్యము, రాజాజ్ఞ అతిక్రమించలేని అత్యున్నత వ్యవస్థలని ఈ కథలు స్పష్టం చేశాయి. ఎక్కడికక్కడ అంతస్థుల వారి భేదాలు కొన సాగుతున్న రాజ్యవ్యవస్థలో రాజుకు ప్రజలు, అగ్రవర్ణాలవారికి శూద్రులు, ప్రభువు లకు సేవకులు విధేయంగా బ్రతకాల్సి వస్తుంది. ఈ విధమైన రాజ్యవ్యవస్థలో భాగంగా రూపొందిన మానవ సంబంధాలలో స్త్రీ, పురుషుడికి విధేయురాలుగా నిర్దేశించబడటం సహజంగా జరుగుతుంది. సింహాసన ద్వాత్రింశికలో స్త్రీల జీవితం పురుషాధీనమై కన్పించే పద్ధతిని ప్రత్యేకంగా అధ్యయనం చేయాల్సి ఉంటుంది.

# పాద సూచికలు - వివరణలు

## అధ్యాయం : 1. సింహాసన ద్వాత్రింశిక - కథాకావ్య పరిచయం

(1) వెంపరాల సూర్యనారాయణశాస్త్రి-సింహాసన ద్వాత్రింశిక-పీఠిక - ఆంధ్ర సాహిత్యపరిషత్తు - కాకినాడ - 1936 - పుట 9

(2) సురవరం ప్రతాపరెడ్డి - ఆంధ్రులసాంఘిక చరిత్ర - పీఠిక ఆంధ్రసారస్వత పరిషత్తు - హైదరాబాద్ - పుట 7,8,9

(3) చూడు - ఆంధ్రసాహిత్య పరిషత్కార్యదర్శుల విజ్ఞాపనము మరియు ద్వితీయ భాగానికి ప్రచురణ కర్తల ముందు మాట - సింహాసన ద్వాత్రింశిక - ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రచురణ సంఖ్య 38. కాకినాడ - 1936 - పుట 11

(4) డి. డి. కోశాంబి - ప్రాచీన భారతదేశ చరిత్ర - అనువాదం: కె. బాల గోపాల్ - హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ - సెప్టెంబరు 1986 - పుట 3

(5) వేకుమళ్ళ కామేశ్వరరావు - కొరవి గోపరాజు కాలము - ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - 1967 - పుట 20

(6) వెంపరాల సూర్యనారాయణశాస్త్రి - సింహాసన ద్వాత్రింశిక - పీఠిక - ఆంధ్రసాహిత్య పరిషత్తు - కాకినాడ - 1936 పుట 7

(7) ఆరుద్ర - కొరవి గోపరాజు - సమగ్రాంధ్రసాహిత్యము - సంపుటము 7 ఎమ్. శేషాచలం అండ్ కో - 1965 - పుట 28

(8) వేకుమళ్ళ కామేశ్వరరావు - కొరవి గోపరాజు కాలము ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - 1967 - పుట 17
2. గడియారం రామకృష్ణశర్మ - సింహాసన ద్వాత్రింశిక - పీఠిక - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమీ హైదరాబాద్ - 1982 - పుట 4

(9) అనుమాండ్ల భూమయ్య - కొరవి గోపరాజు సాహిత్య విశ్లేషణ 1983 - పుట 5

(10) 1. గడియారం రామకృష్ణశర్మ - సింహాసన ద్వాత్రింశిక - పీఠిక - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమి - హైదరాబాద్ - 1982 - పుట 5
2. ఆరుద్ర - కొరవి గోపరాజు - సమగ్రాంధ్రసాహిత్యము - 7వ సంపుటము -ఎమ్. శేషాచలం అండ్ కో - 1965 - పుట 28

(11) డి. డి. కోశాంబి - భారతదేశచరిత్ర పరిచయ వ్యాసాలు (అనువాదం: వి. రామకృష్ణ)- హైదరాబాద్ బుక్ట్రస్ట్ - జనవరి 1987 - పుట 32

(12) 1. పైదే పుట - 128
మరియు
2. రొమిల్లాథాపర్ - **A History of India - Penguin books** - 1966 - పుట 139, 140

(13) సింహాసనద్వాత్రింశికలో 'కాకతి భూపతి'ని గురించి 8వ ఆశ్వాసంలో 159 వ పద్యములో పేర్కొన్నాడు - నేలటూరి వెంకటరమణయ్య - వ్యాసమంజరి - ఆంధ్రసారస్వత పరిషత్తు - 1967 ముద్రణ పుట 242

(14) కోట వెంకటాచలం - భారతీయ శకములు - ఆర్య విజ్ఞానం - 5 ప్రచురణ సంఖ్య 10 - అక్టోబరు 1950 - పుట 54, 55

(15) ఆపద్ర - సమగ్రాంధ్రసాహిత్యము - ఇక్కన విక్రమార్కచరిత్రం-5వ సంపుటము - 1965 - పుట 62
నేలటూరి వెంకటరమణయ్య - వాఙ్మయ వ్యాసమంజరి - ఆంధ్ర సార స్వత పరిషత్తు - 243 పుట
సిం. ద్వా. త్రి. చరిత్రగ్రంథముకాదు. కాకతీయుల చరిత్రకాదు. కాని అప్పటి ఆంధ్రుల జాతీయ జీవనమందు ప్రతిబింబించింది. ప్రచారంలో ఉన్న కథలలోని పాత్రలన్నియు కాకతీయులనాటి ఆంధ్రుల రూపు ధరించినది. వేషభాషలు ఆచారవ్యవహారాలు అప్పటివే.

(16) గడియారం రామకృష్ణశర్మ - సింహాసన ద్వాత్రింశిక -పీఠిక - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి హైదరాబాద్ - 1982 - పుట (30)
విశ్వామిత్రుని తపోభంగానికి ఇంద్రుడు అప్సరసలను పంపించేటప్పుడు ఎంపిక కోసం విక్రమార్కుడిని ఇంద్రలోకానికి ఆహ్వానించినట్లు, ఆ అప్సరసల నాట్యంలో ఊర్వశి నాట్యం గొప్పదని విక్రమార్కుడు నిర్ణ యించినట్లు అందుకు ప్రతిఫలంగా కానుక రూపంలో విక్రమాదిత్యునికి ఇంద్రుడు సింహాసనమిచ్చినట్లు కనబడుతుంది (1-123, 136, 137)

(17) పైదే పుట

(18) కోట వెంకటాచలం - భారతీయ శకములు - ఆర్యవిజ్ఞానం - 5, ప్రచురణ సంఖ్య -10, అక్టోబరు 1950 - పుట 55

(19) వేకుమళ్ళ కామేశ్వరరావు – కొరవి గోపరాజు కాలము – ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక – 1967 – పుట 23

(20) నన్నయ్య ఆంధ్రమహాభారతం – ఆదిపర్వం – 29వ పద్యం

(21) లూయీ హెన్రీమోర్గన్ – పురాతన సమాజం (అనువాదం: మహీధర రామమోహనరావు) విజ్ఞాన వికాస సమితి ప్రచురణ 1982 – పుట 252

(22) కార్ల్‌మార్క్స్ ఫెడరిక్ ఏంగిల్స్ సంకలిత రచనలు 111
అనువాదం: 1. నిడమర్తి ఉమారాజేశ్వరరావు | ప్రగతి ప్రచురణా
2. కంబంపాటి సత్యనారాయణ | లయం 1982
3. మహీధర రామమోహనరావు | పుట 292

(23) లూయీ హెన్రీమోర్గన్ – పురాతన సమాజం విజ్ఞాన వికాస సమితి ప్రచురణ 1987 – పుట 7

(24) పైదే పుట – 24

(25) మార్క్స్, ఏంగిల్స్ సంకలిత రచనలు 111 పుట – 306.

(26) లూయీ హెన్రీమోర్గన్ – పురాతన సమాజం – విజ్ఞాన వికాస సమితి ప్రచురణ జనవరి 1987. పుట 317.

(27) డి.డి. కోశాంబి – ప్రాచీన భారతదేశ చరిత్ర – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ సెప్టెంబరు 1983. పుట 52, 53

(28) మార్క్స్, ఏంగిల్స్ సంకలిత రచనలు 111 పుట : 299

(29) భగవద్గీత – నాల్గవ అధ్యాయము జ్ఞానయోగము. 13 శ్లోకం

(30) సుప్రసన్నాచార్య — ముందుమాట — కొరవి గోపరాజు కావ్య విశ్లేషణ అనుమాండ్ల భూమయ్య – 1983 – పుట 6.

(31) రొమిల్లాథాపర్, హర్బన్‌ముఖియా, బిపినచంద్ర– చరిత్ర రచనలో మతతత్వం, హైదరాబాద్ బుక్ ట్రస్ట్ నవంబరు – 1984 – పుట 19.

# 2. మహిళా జన జీవన అధ్యయనం

## 2.1. సామాజిక చారిత్రక నేపథ్యం

ఉత్పత్తి శక్తులలోనూ, ఉత్పత్తి సంబంధాలలోనూ వచ్చిన మార్పులను బట్టి స్త్రీ పురుష సంబంధాలు మార్పులకు లోనవుతూ పరిణమించిన క్రమంలో స్త్రీ పురుషుల మధ్య చోటు చేసుకున్న అసమానతలు స్త్రీని ఉత్పత్తి రంగం నుండి దూరంచేశాయి. ఏ వ్యక్తిగత ఆస్తి వర్గ సమాజం ఏర్పడటానికి దారులు తీసి రాజ్యా విర్భావానికి కారణమైందో, ఆ వ్యక్తిగత ఆస్తియే పితృస్వామ్య సమాజం ఏర్పడ టానికి కారణమై స్త్రీ పురుషలను అసమస్థాయి వ్యక్తులుగా చేసింది. ఈ అసమ సామాజిక వ్యవస్థలో స్త్రీలు పరాధీనులుగా చేయబడిన చారిత్రక క్రమం, సాహిత్యంలో స్త్రీ జనజీవన విషయాల అధ్యయనానికి సిద్ధాంత ప్రాతిపదిక అవుతుంది. ఉత్పత్తి సంబంధాలలో వచ్చిన మార్పులను అనుసరించి స్త్రీ పురుష సంబంధాలు మార్పుకు లోనవుతూ పరిణమించటం ఈ చారిత్రక క్రమంలో అర్థం అవుతుంది.

ప్రారంభకాలంలో మానవులు ఆత్మరక్షణకై గుంపులు గుంపులుగా తిరుగుతూ ఆహారసేకరణ చేసేవారు. స్త్రీ పురుషులు కలిసి ధాన్యం, పళ్ళు, దుంపలు సేకరించేవారు. వేటాడిన జంతువులను తినేవారు. ఆ సామాజిక వ్యవస్థలో స్త్రీ పురుషుల మధ్య స్వేచ్ఛాయుత సంబంధాలుండేవి. అక్కడ గుంపు సంఖ్యాబలం అభివృద్ధి చెందటం అనేది ముఖ్యాంశం. అందుకు అనుగుణంగా మిగిలిన జంతువుల నుండి విడివడుతూ 'మానవుడు' పరిణమిస్తున్న దశలో స్త్రీ పురుష సంబంధాలు వావి వరుసలు లేని విశృంఖల సంబంధాలుగా ఉండటం సహజం. నిర్బంధాలు నిషేధాలు రూపొందే వాతావరణమింకా అప్పటికి సిద్ధం కాలేదు[2]. ఈ పరిస్థితులలో సంతానానికి తల్లి ఎవరో స్పష్టంగా తెలిసినట్లు తండ్రి ఎవరో తెలియ టానికి అవకాశంలేదు. కనుక సంతానం తల్లి ద్వారానే గుర్తించబడేది. క్రమంగా తరానికి తరానికి మధ్య స్త్రీ పురుష సంబంధాలు నిషేధానికి గురి అయి తోడబుట్టిన సోదరిసోదరులకు, వేలువిడిచిన సోదరీ సోదరులకు మధ్య సంబంధాలు ఏర్పడుతూ రక్తసంబంధీకుల కుటుంబం అవతరించింది[3]. ఒకతరం స్త్రీ పురుషులకు తరువాత తరం స్త్రీ పురుషులకు అంటే తల్లిదండ్రులకు సంతానానికి మధ్య సంబంధాలు నిషేధం కావటానికి ఆ రకమైన సంబంధం తప్పు అన్న భావన బలపడటం[4] అనే కంటే అంతకు మించి వయసులోని తారతమ్యం వల్ల లైంగిక వాంఛల్లో ఉండే హెచ్చు తగ్గులు (మానసిక భావాలు) కారణమై ఉంటాయనుకోవచ్చు. కనుక తరా

ఒక తరానికి మధ్య నిషేధం ఏర్పడి ఒకే తరం స్త్రీ పురుషుల మధ్య సంబంధం నిర్దేశింపబడింది. అంటే ఒక తల్లిదండ్రుల పిల్లలు వాళ్ళల్లో వాళ్ళు మళ్ళీ భార్యా భర్తలుగా ఉండే వ్యవస్థ ఇది. ఐతే ఇది కూడ క్రమంగా మార్పుకు లోనయి కొన్నాళ్ళకు తోడబుట్టిన సోదరీసోదరుల మధ్య సంబంధం కూడ తగ్గటం మొదలైంది. స్వీయానుభవ పరిశీలనంవల్ల మానవ చైతన్యం అభివృద్ధి చెందుతూ ఈ సోదరీ సోదరులు ఒకే తల్లితో స్తన్య సంబంధాన్ని కలిగి ఉన్నామని గ్రహించటం ఇందుకు కారణం కావచ్చు. సోదరీ సోదరుల మధ్య సంబంధాలు క్రమంగా అంతరించటం మొదలైంది.

ఈ విధమైన స్త్రీ పురుష సంబంధ వ్యవస్థ పరిణమిస్తూ వస్తున్న కాలం ప్రధానంగా ఆహార సేకరణ దశకు చెందింది. పునరుత్పత్తికి బాధ్యురాలైన స్త్రీ గర్భవతిగా ఉన్న కాలంలో కాని, ప్రసవించి పసిబిడ్డ తల్లిగా ఉన్న కాలంలోకాని ఒకచోట స్థిరంగా ఉండాల్సి రావటంతో, ఆహార సేకరణకు అంటే వేటకుగాని, తృణధాన్యాల సేకరణకుగాని పురుషులే వెళ్ళటం జరిగేది. ఫలితంగా వేటాడ్డానికి ఉపయోగించే ఉత్పత్తి పరికరాలను ఉపయోగించటంలో పురుషుల నైపుణ్యం పెరిగి ఉత్పత్తి సాధనాలమీద వాళ్ళ ఆధిపత్యం స్థిరపడటం మొదలైంది. అదే సమయంలో ప్రాకృతిక శారీరక మార్పుల కారణంగా స్థిరంగా ఒకచోట ఉండటం తప్పని సరి ఐన స్త్రీలు ప్రకృతిని నిరంతరం పరిశీలించటానికున్న అవకాశం వల్ల విత్తనం యొక్క మొలకెత్తే స్వభావం నుండి తృణధాన్యాలను పండించవచ్చని గ్రహించ గలిగారు. అలాగే అదనపు ఆహారాన్ని నిలవచేయటానికి మట్టితో ముంతలు చేయటంకూడ స్త్రీలు నేర్చారు. ఈ కార్యకలాపాలు ఉత్పత్తి విధానంలో అభివృద్ధి కరమైన పరిమాణాలకు దారితీస్తూ స్త్రీలను పురుషులతో పాటు సమానంగా నిల బెట్టాయి. ఆహార సేకరణ దశ ఆహార ఉత్పత్తి దశగా మారడానికి మంచి ప్రారంభం చేశారు స్త్రీలు. ఇదే సమయంలో పురుషులు వేటాడి జంతువులను చంపి తినటం కంటే పెంచి పోషించి వాటిని మరింత ప్రయోజన వంతంగా ఉపయోగించుకో వచ్చని పరిశీలనానుభవంలో గ్రహించారు. వేటాడటానికి ఉపయోగించే పరికరాలమీద పెత్తనం ఏర్పడిన క్రమంలోనే, పెంచి పోషించిన పశువుల మీద కూడ పురుషుడికి పెత్తనం ఏర్పడసాగింది.

పశుపోషణలో పురుషుడు పశువులను మేపుకుంటూ సంచార జీవనం చేసేటప్పుడు ప్రక్క క్షేత్రాలకు వెళ్ళటం వల్ల, ఆయా ప్రాంతాలలోని వేరు వేరు గుంపులలోని స్త్రీలతో సంబంధాలు ఏర్పడటానికి అవకాశం కలిగింది. ఈ పరిస్థితి ఒకే గుంపులో స్త్రీ పురుష సంబంధాలపట్ల ఆసక్తిని తగ్గించి గుంపు పెళ్ళిళ్ళకు

కారణమైంది. ఒకే గుంపులోని స్త్రీ పురుషుల మధ్య అంతర్గత సంబంధాల వల్ల కలిగిన సంతానంకన్నా వేరువేరు గుంపులలోని స్త్రీపురుషుల మధ్య ఏర్పడే సంబంధాలవల్ల కలిగే సంతానం ఎక్కువ శారీరక మానసిక వికాసం కలిగి ఉండటాన్ని కూడ అనుభవంలో గమనించటం గుంపు పెళ్ళిళ్ళకు దారితీసి ఉంటుంది[7]. ఈ పద్ధతిలో ఒక గుంపులోని స్త్రీలంతా మరో గుంపులోని పురుషులకు ఉమ్మడి భార్యలుగా ఉంటారు. అట్లాగే పురుషులుకూడా ఉమ్మడి భర్తలుగా ఉంటారు.

అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళ మధ్య వివాహాన్ని నిషేధించటం ప్రాథమిక లక్షణంగా అభివృద్ధి చెందిన ఈ గుంపు పెళ్ళి వ్యవస్థ గణాలు ఏర్పడటానికి దారితీసింది. అయితే తోడబుట్టిన అన్నదమ్ములు అక్కచెల్లెళ్ల మధ్య సంబంధాల నిషేధానికి గురి అయినా గుంపులోని అంతర్గత సంబంధాలలో వెలువడిచిన అన్నదమ్ముల, అక్కచెల్లెళ్ళ సంబంధాలు మాత్రం ఇంకా కొనసాగుతున్నాయనే చెప్పాలి. ఈ వ్యవస్థలో కూడా సంతానాన్ని తల్లిద్వారా తప్ప మరొక రకంగా గుర్తించటానికి అవకాశంలేదు. కనుక గణవ్యవస్థలో స్త్రీ పారంపర్యమే కొనసాగింది[8]. అందువల్లనే ఈ వ్యవస్థలో పురుషుడికి తనదైన ఏకొద్దిపాటి ఆస్తిఉన్నా అది అతని గణానికే చెందిందిగా ఉంటూ సోదరి పిల్లలకు వారసత్వంగా వస్తుంది. ఈ గుంపు పెళ్ళి వ్యవస్థలోనే బహు భార్యాత్వానికి బీజాలు కన్పడతాయి. గుంపులమధ్య యుద్ధాలవల్ల, యుద్ధ వ్యవసాయంలో పురుషుడే పాల్గొనటంవల్ల వాళ్ళ సంఖ్య తగ్గిపోతూ స్త్రీల సంఖ్య ఎక్కువగా ఉండటం జరిగింది. స్త్రీ పురుషుల సంఖ్యలో సమానత్వం చెదరిపోయిన ఈ పరిస్థితిలో గుంపు పెళ్ళిళ్ల వ్యవస్థలోని స్త్రీ పురుష సంబంధాలలో బహుభార్యాత్వం చోటుచేసుకోవటానికి అవకాశం ఏర్పడింది.

క్రమంగా గుంపుపెళ్ళిళ్ళ స్థానంలో జంట పెళ్ళి చోటుచేసుకున్నది. గుంపు సంబంధాలనుంచి గుంపు పెళ్ళిళ్ళవరకు ప్రతి స్థాయిలోనూ ఒక స్త్రీ, ఒక పురుషుడు జంటకూడటం స్త్రీ పురుష సంబంధాలలో ప్రాథమిక నియమమే ఐనా అందులో నిర్దిష్ట కాలపరిమితికిగాని, స్థిరత్వానికిగాని చోటులేదు. అనుభవజ్ఞానం నుండి స్త్రీ పురుషుల సంబంధాలలో నున్న సంక్లిష్టతను తొలగించుకోవాలన్న ఆలోచన అభివృద్ధిచెంది ఒక స్త్రీ ఒక పురుషుడు ఇష్టమైనంతకాలం జంటకూడి ఉండటం అవసరమైంది. పైగా గుంపు పెళ్ళిళ్ళలోని పీడన స్వభావం తొలగించుకోవటం ఈ జంటపెళ్ళి వ్యవస్థకు స్త్రీవేపునుండే తాపత్రయం ఉండి ఉంటుంది[9]. ఆ క్రమంలో జంటపెళ్ళి ఒక అభివృద్ధికరమైన పరిణామం.

గుంపు పెళ్ళి దశవరకు తల్లిమాత్రమే స్పష్టమైతే ఈ జంట పెళ్ళి వ్యవ

స్థలో స్త్రీ పురుషలిద్దరూ కొంతకాలం నిలకడగా జంటకూడి ఉండటంవల్ల తండ్రి కూడ తెలిసేస్థితి ఏర్పడింది. సంతానోత్పత్తి ప్రక్రియలో స్త్రీపురుషలిద్దరిని బాధ్యులుగా నిలబెట్టినా ఈ వ్యవస్థలోనూ పిల్లలు తల్లికి చెందినవారే. రక్తసంబంధీకుల మధ్య స్త్రీ పురుష సంబంధాలుండటం నిషేధానికి గురి అవుతూ గణ వ్యవస్థలోకి మరింత బాగా విస్తరించింది. ఫలితంగా గణసంస్థలో సోదరీ సోదర తరగతుల సంఖ్య పెరిగి, గుంపు సంబంధాలు అసాధ్యమైన సామాజిక అవసరంనుండి జంట పెళ్ళిళ్ళు అమలులోనికి వచ్చాయి[10]. స్త్రీ పురుషలిద్దరూ జంటకూడి ఉన్న ఈ దశలో కూరలు పండించటం, తోటవేయటం, నివాసయోగ్యంగా ఇల్లు కట్టుకోవటం కూడ మొదలైంది. స్త్రీ గృహోపయోగంకోసం తయారుచేసిన వస్తువులమీద సంపూర్ణమైన హక్కు కలిగి ఉండేది. పశుపోషణవల్ల పశుసంపద ఏర్పడి పురుషుడి స్వంత ఆస్థిగా రూపాంతరం చెందసాగింది. జంట సంబంధం నుండి స్త్రీపురుషులు విడిపోయేటప్పుడు స్త్రీ తను తయారుచేసిన వస్తువులను, తాను కన్న సంతానాన్ని తనతోపాటు తీసికొని వెళ్ళేది. ఇద్దరికి సంబంధించిన తోట, ఇల్లు ఇత్యాదులలో సగిభాగం తాను తీసుకునేది. పశుసంపద పురుషుడిదిగా ఉండేది. స్త్రీ పురుష సంబంధాలు వ్యవస్థీకృతమయ్యే క్రమంలో మొదటి దశ సోదరీ సోదరుల మధ్య సంబంధాలు ఈ సంబంధం ప్రాతిపదికగా అభివృద్ధి చెందిన మానవ సమాజంలో దీని మూల స్వభావమే కొనసాగిరావటం సహజం. అయితే తరాలు గడిచేకొద్ది స్త్రీ పురుష సంబంధాలు స్థిరత్వంపొందే క్రమంలో సోదరీసోదరుల మధ్య సంబంధాలు అంతరిస్తూ అవి వాళ్ళ పిల్లల మధ్య సంబంధంగా రూపాంతరం చెందాయి.

జంట పెళ్ళి వ్యవస్థలో పురుషుడు తన సంతానాన్ని గుర్తించగలిగినా ఆ సంతానంమీద అతనికెటువంటి హక్కులేదు. తన సంతానం స్పష్టంగా తెలిసిన తరువాత కూడా స్త్రీ పారంపర్యం కారణంగా తన గణంలోని తనకున్న పశుసంపదను అక్కచెల్లెళ్ల పిల్లలకు ఇవ్వాల్సిరావటం అనే సాంప్రదాయాన్ని పాటిస్తూనే తన సంతానం ఎవరో తనకు స్పష్టంగా తెలియటంవల్ల తన సంతానానికి కూడ ఆస్తిని వారసత్వంగా అనుభవయోగ్యం చేయాలనే పురుషుడి ఆలోచనాక్రమంనుండి సోదరీసోదరుల పిల్లల మధ్య సంబంధాలు బలపరచబడి ఉంటాయి. ఇది ఆస్తుల సమీకరణకు తోడ్పడటంకూడ అవుతుంది. 'జంటపెళ్ళి' వ్యవస్థలో సైద్ధాంతికంగా ప్రత్యేకించి ఒక స్త్రీ ఒక పురుషుడు జంటకూడి ఇచ్ఛానుసారం నిర్దిష్టకాలం జీవిస్తారు. కాని నిజానికి ఇది స్త్రీవైపునుండే ఆచరణలోకి వచ్చింది. అంతకు పూర్వమున్న స్త్రీ పురుష సంబంధాల వ్యవస్థ తనకు పీహాకారంగా ఉన్న విషయాన్ని అనుభవంలో గ్రహించిన స్త్రీలు ఏకపత్నీత్వ సంబంధాలేర్పరచుకోవటానికి చొరవ చూపించారు.

సంపు పెళ్ళిలోని సాంగత్య స్వేచ్ఛ పురుషుడి పరంగా ఏ విధమైన అభ్యంతరం లేకుండా అమలులోనే ఉంటూ వచ్చింది. అందువల్ల జంటపెళ్ళి వ్యవధిలోనే స్త్రీ విషయంలో పాతివ్రత్యం అన్న భావన స్థిరపడింది. జంటకూడి ఉన్న స్త్రీతో మాత్రమే కాక ఇతరేతర స్త్రీలతోకూడ పురుషుడు సంబంధాలేర్పరుచుకోవటం జరిగింది. ఫలితంగా బహుభార్యాత్వం జంటపెళ్ళి వ్యవస్థలోనే ప్రత్యేకతను సంతరించుకుంది[11].

ఐతే ఇనుము వాడకం వచ్చి లోహపు పనిముట్లు, నాగలి ప్రధాన ఉత్పత్తి సాధనాలై, ఆ ఉత్పత్తి సాధనాలు వాడటానికి ఉన్న అవకాశాలవల్ల పురుషులు నైపుణ్యం పెంచుకొని అంతవరకు స్త్రీల చేతిలో ప్రాథమిక స్థాయిలో ప్రధానంగా సాగుతున్న వ్యవసాయాన్ని స్వాయత్తం చేసుకున్నారు. ఈ స్థితిలో భూమి వ్యవసాయ యోగ్యం అవుతూ అదనపు సంపద సమకూడ సాగింది. ఈ అదనపు సంపదను అందించడానికి వారసులమీద హక్కు కావాల్సి వచ్చింది. జంట పెళ్ళి వ్యవస్థలో తండ్రికి తన పిల్లలెవరో తెలిసిందికాని వాళ్లమీద ఏరకమైన హక్కు లేదు. సంతానంమీద అంతవరకు తల్లికి ఉన్న హక్కును పురుషుడికి బదలాయించటం కోసం ఇష్టం వచ్చినపుడు పురుషుడ్ని వదిలివెళ్ళే స్వేచ్ఛ స్త్రీకి పరిహరించబడాలి. ఆ క్రమంలోనే శాశ్వతంగా ఒకే పురుషుడితో సంబంధంలో ఉంచే దంపతీవ్యవస్థకు జంట పెళ్ళి స్థానంలో రూపకల్పన జరిగింది[12]. ఆస్తులు పోగుపడడం, అవి ఒక స్థిరమైన రూపాన్ని తీసికోవటం వాటిమీద వ్యక్తుల అధికారం అధికం కావటమూ, స్త్రీ పారంపర్యాన్ని తొలగించి పురుష పారంపర్యాన్ని ఏర్పడటాన్ని అనివార్యం చేసింది[13]. ఆ రకంగా జంటపెళ్ళిళ్ల వ్యవస్థా కాలంలోనే పురుషుడి సంపదగా రూపొందుతూ వచ్చిన పశుగణం వ్యవసాయం స్థిరపడే క్రమంలో భూమినికూడ కలుపుకుని స్వంత ఆస్తిగా పరిణమిస్తూ దంపతీ కుటుంబ వ్యవస్థకు మూలం అయింది[14]. దానితో ఆస్తి అనేది స్పష్టమైన రూపాన్ని తీసికొని తండ్రినుంచి కొడుకుకు సంక్రమించాలన్న భావనను బలపర్చింది. తండ్రి అధికారాన్ని అది స్థిరపర్చింది. పితృస్వామ్య కుటుంబ పరిణామానికి దోహదం చేసింది. కుటుంబ సభ్యులమీద, ఆస్తులమీద తండ్రి యాజమాన్యం దాని భౌతిక లక్షణం[15]. ప్రకృతి సంపదల మీద ప్రాచీనకాలంనాటి సమిష్టితత్వం పోయి, వ్యక్తిగత ఆస్తి హక్కు ఏర్పడిన దానికి ఫలితం ఈ పితృస్వామ్య కుటుంబవ్యవస్థ. స్త్రీపురుష సంబంధాలలోని ఈ దాంపత్య వ్యవస్థలో మగవాడికి కుటుంబంలో పెత్తనం ఇవ్వటం. అతని సంపదకు వారసులుగా అతనికే పుట్టిన బిడ్డల్ని చూపటమూ జరిగింది[16]. స్త్రీపురుష సంబంధాలలో స్థిరత్వాన్ని తీసుకువచ్చి పిల్లల పుట్టుక కేకాక పెంపకానికికూడ తల్లి

దంద్రులనిద్దరిని బాధ్యులుగా చేయటంవల్ల దంపతీ వివాహం చారిత్రకంగా ఒక అడుగు ముందుకు వేసినా కాని అదే సమయంలో ఆచరణలో మాత్రం ఆ బాధ్యత కేవలం స్త్రీల నెత్తిన రుద్దబడింది. పరాయిదిగా ఉంటూ దాంపత్య వ్యవస్థలో స్త్రీ పురుషుడి పిల్లలకు బాధ్యురాలు కావల్సివస్తున్నది. ఈ బాధ్యతను ఆమె సక్రమంగా నిర్వహించటానికి పతివ్రత కావటం తప్పనిసరయింది. దాంతో పితృస్వామిక సామాజిక వ్యవస్థ పాతివ్రత్యాన్ని స్త్రీకి ధర్మంగా స్థిరపరచి ఆ ధర్మ నిర్వహణకు ఆటంకం ఏర్పడకుండా ఉండటానికై ఆమెకు కుటుంబ పరిధిలో బంధించటం జరిగింది. సామాజిక శ్రమ విభజనలో పురుషుడు వేటాడ్తే తాను వ్యవసాయం కనుక్కొని, నిప్పు ఉపయోగాలను తెలిసికొని, ఆహారాన్ని వండటం నేర్చుకొని, గృహ పరికరాలను తయారుచేసి మానవ నాగరికతాభివృద్ధికి దోహదకారియైన స్త్రీని కేవలం ఇంటి పనికి పరిమితం చేయటం జరిగింది. సామాజిక ఉత్పత్తి కార్యకలాపాలనుండి దూరం చేయబడి పిల్లల్ని కనటం, పెంచటం ఇంటి పనులను చక్కబెట్టడం మాత్రమే శ్రమ విభజనలో స్త్రీలవంతు పనిగా మిగిలింది. ఇది స్త్రీజీవితంలో పరాధీనతకు ప్రారంభం[17]. కుటుంబంలో భర్తకు మాత్రమే కట్టుబడి బ్రతకాల్సిన వ్యక్తిగా దంపతీ వ్యవస్థలో స్త్రీల జీవితం నిర్దేశింపబడింది. ఆస్తికి వారసులు కాగలిగిన సంతానం ఆ పురుషుడిదేనన్న నమ్మకం కల్గటానికి వీలుగా స్త్రీకి పాతివ్రత్యాన్ని ప్రబోధం చేసిన పితృస్వామ్య సామాజిక వ్యవస్థలోని ప్రధాన నైతిక వైరుధ్యం పురుషులకు మాత్రం అంతకుముందున్న స్త్రీపురుష సంబంధ వ్యవస్థలోని స్వేచ్ఛ కొనసాగిరావటం, ఫలితంగా కుటుంబంలో దంపతీ సంబంధాలతోపాటు వ్యభిచారం, జారత్వం ప్రవేశించాయి. కుటుంబం బయట వేశ్యావ్యవస్థ అభివృద్ధి చెందింది. సామాజికంగా ఆర్థికంగా పరాధీనులైన బానిస స్త్రీలు, జీవికగడవని ఇతర స్త్రీలను వేశ్యలుగా తయారుచేసి పురుషుల ఉమ్మడి భోగానికి సంసిద్ధం చేసింది ఈ పితృస్వామిక దాంపత్య వ్యవస్థ. దంపతీ వివాహ వ్యవస్థలో భోగలాలసులైన భర్తల వేశ్యాలోలత్వం కారణంగా ఇళ్లలో నిరాదరణకు గురిఅయ్యే స్త్రీలు జారిణులు కావటానికి అవకాశం ఏర్పడుతుంది[18].

వ్యక్తిగత ఆస్తి పునాదిగా ఏర్పడిన దాంపత్య వ్యవస్థలో ఆ ఆస్తికి వారసులనందించాల్సిన భార్య కూడ క్రమంగా సంపదలో భాగమైంది. మానవ వ్యక్తిగా తన అస్తిత్వాన్ని కోల్పోయి పురుషుడికి సంతానాన్ని ఇవ్వగలిగిన లైంగిక వస్తువుగా మిగిలిపోయింది. ఈ సామాజిక పరిణామ క్రమంలోనే పితృస్వామ్య సామాజిక వ్యవస్థ పురుషుడి భోగానికి వీలుగా కుటుంబంలోనికి వ్యభిచారాన్ని తీసుకు వచ్చింది.

ఈ విధంగా బలపడిన పితృస్వామ్య కుటుంబ వ్యవస్థలో స్త్రీ ఇంటా బయటకూడా రెండవ స్థానానికి నెట్టివేయబడి, అసమశ్రమ విభజనలో భాగంగా విసుగు కలిగించేది, యాంత్రికమైనది, ఏ ఆర్థిక విలువ లేనిది ఐన ఇంటి పని స్త్రీలదై, ఆ పనిచేసే స్త్రీలుకూడ హీనంగా చేయబడిన సామాజిక పరిణామక్రమంలో స్త్రీ పురుష సంబంధాలను అసమ సంబంధాలుగా మార్చింది. స్త్రీ పురుషల మధ్య సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక వైరుధ్యాలనేకం సృష్టించింది. కనుకనే దంపతీ వివాహవ్యవస్థ చారిత్రకంగా ఒక అడుగు ముందుకు వేసినా సాపేక్షకంగా అది ఒక అడుగు వెనక్కు వేసింది. ఈ విధంగా పరిణమిస్తూ వచ్చిన స్త్రీ పురుష సంబంధ వ్యవస్థను, అందులోని వైరుధ్యాలను క్రమబద్ధీకరించటంలోని భాగంగానే మత, నైతిక, సాంస్కృతిక భావజాల సంస్థలు పితృస్వామ్య వ్యవస్థను సమర్థించేవిగా రూపొందాయి. ఆ వ్యవస్థ అస్తిత్వానికవసరమైన సూత్రాలను రూపొందించి ప్రచారం చేస్తాయి. ఆ క్రమంలో సాహిత్యం కూడా ఈ భావజాల ప్రచారానికి ఒక సాధనమవుతుంది. 'సింహాసనద్వాత్రింశిక' వివిధ కథలు కథలలోని ఆలోచనలు, సంభాషణలు వీటన్నిటి ద్వారా పితృస్వామ్య వ్యవస్థకు అందులోని మహిళల స్థితిగతులకు దర్పణంగా నిలబడుతుంది.

## 2.2. మహిళా జన జీవనం – కుటుంబం లోపల

రాజ్యం ఒక బలమైన శక్తిగా రూపొందిన మధ్యయుగాల నాటికి, దానితో అంతర్గత అన్యోన్య సంబంధంకల పితృస్వామ్య సామాజిక వ్యవస్థ కూడ బలపడింది. ఆ సామాజిక వ్యవస్థలో వర్గ వైరుధ్యాలతోపాటు స్త్రీ పురుషుల మధ్య అసమానతలు స్పష్టమైన రూపం తీసుకొన్నాయి. ఈ సమాజ అసమానతలను ప్రతిఫలన రూపమైన సాహిత్యం ప్రతిఫలించటం అనివార్యం. సమాజ జీవితంలో భాగమైన కవితా నేవిధమైన సమాజాన్ని చూస్తున్నాడో దానిని తన చైతన్యస్థాయిని బట్టి సాహిత్య కళారూపాలద్వారా చిత్రించటం జరుగుతుంది.[19] కొరవి గోపరాజు 'సింహాసన ద్వాత్రింశిక'లో ఈ విధమైన చిత్రణ పితృస్వామ్య సామాజిక వ్యవస్థా స్వభావాన్ని ఏ మేరకు ఏయే భిన్న కోణాలనుండి ప్రదర్శించిందో పరిశీలించి, తద్వారా అపగత మధ్యయుగ జనజీవితాన్ని విశ్లేషించి విమర్శించటం ఈ అధ్యాయంలో జరుగుతుంది.

'జీవనం' అంటే 'బ్రతుకు'. పుట్టింది మొదలు మరణించే వరకు సమాజంలో మహిళలు బ్రతుకుబాటలో ఎలా పయనించారో సమగ్ర సమాచారంతో నిరూపించింది సింహాసనద్వాత్రింశిక. సింహాసనద్వాత్రింశికలోని వివిధ కథలు మధ్యయుగాలనాటి స్త్రీల జీవిత స్థితిగతులను అర్థం చేసుకోవటానికి మూలాధారాలుగా

పనికొస్తాయి. కుటుంబం లోపల, కుటుంబం బయట అనే రెండు కోణాలనుండి పరిశీలించినప్పుడు స్త్రీల జీవితం సమగ్రంగా అర్థం అవుతుంది. కొరవి గోపరాజు దృష్టిలో కూడ స్త్రీలు కుటుంబ, కుటుంబేతర భేదాలతో రెండు రకాలుగా ఉన్నారు. కవి వాళ్ళను 'పుణ్యస్త్రీలు' అని, 'పణ్యస్త్రీలు' అని (4-190). వేరుచేసి చెప్పాడు. అందువలన ఈ కావ్యంలో మహిళా జనజీవనాన్ని కుటుంబం లోపల, కుటుంబం బయట అని రెండు విభాగాలుగా అధ్యయనంచేయటం ప్రయోజనకరంగా ఉంటుంది.

## 2.2.1. పుట్టుక :

'పుట్టుక' అనే బిందువునుండి ప్రారంభించి జీవితం విస్తృతం అవుతుంది. 'పుట్టుక' దగ్గరే స్త్రీ పురుషులమధ్య విచక్షణకూడ ప్రారంభం అవుతుంది. ఆస్తిని వారసత్వంగా కొడుకులకు అందించే తండ్రి పెత్తనం కల పితృస్వామ్య వ్యవస్థ 'కొడుకు పుట్టుకనే' కోరుకోవటం సహజం. ఆ క్రమంలో కూతురి పుట్టుక అవాంఛనీయమైనది. అధర్వణవేద కాలంనాటికి గర్భస్థమైన పిండం ఆడపిల్ల కాకూడదని పుత్రుడుగ జన్మించాలని భావించటం కనపడుతుంది. ఐతరేయ బ్రాహ్మణాల కాలం నాటికి 'పుత్రిక' పుట్టటం అనర్థదాయకంగా పరిణమించింది.[20] ఈ సామాజిక సంస్కృతినుండే పుత్రుడు పున్నామనరకంనుండి తరింపజేస్తాడనే భావన అభివృద్ధి చెంది 'కొడుకు' పుట్టుకనే వాంఛించటానికి అదొక పౌరాణిక న్యాయప్రతిపత్తిగా ముందుకు వచ్చింది.[21] అందువల్లనే సింహాసన ద్వాత్రింశికలో నాల్గవ బొమ్మ చెప్పిన కథలో విలోచన, విలోచనుడు అనే భార్యాభర్తలు తమకంతవరకు అసలు పిల్లలే లేకపోయినా ఎవరోఒకరు పుడితే చాలునని అనుకోకుండా కొడుకే పుట్టాలని కోరుకున్నారు. అందుకోసం తపస్సుకూడా చేశారు. ఇక్కడ గమనించాల్సిన విషయమేమిటంటే మాతృత్వాన్ని కోరుకున్న విలోచన స్త్రీయై ఉండికూడ 'తనయుండు గలుగ నీశ్వరు నారాధన మొనరింపుదమని' (3-11) భర్త వాంఛితానికనుగుణంగా తన సమ్మతిని తెలిపింది. స్త్రీయై ఉండి స్త్రీ పుట్టుకను కాక పురుష ప్రయోజనాల కనుకూలంగా కొడుకు పుట్టుకను వాంఛించిందంటే పితృస్వామ్య సమాజధర్మం ఆమె చైతన్యాన్ని ఎంతగా ప్రభావితం చేసి ఎలాగా మలిచిందో అర్థం చేసుకోవచ్చు.

కుటుంబవ్యవస్థలో రెండవస్థానంలోఉన్న స్త్రీ కొడుకు పుట్టుకవల్ల మాత్రమే భర్త యొక్క గుర్తింపుకు, గౌరవాదరాలకు పాత్రురాలు కావటం జరుగుతుంది. విక్రమార్కుని 'పిన్నయాలికి గర్భం వచ్చి కొడుకు పుట్టినపుడు చెలికత్తెలు

'కొడుకు బడిసితివి రాజు కూరిమి బలిసెన్ (3-46) అని పొగడారు. దంపతీ వివాహ వ్యవస్థలో భార్య కొడుకును కనటంద్వారా భర్త ప్రేమను అంతకుపూర్వం కంటె అధికంగా పొందటానికి వీలుంది. దంపతీ వివాహ వ్యవస్థ స్త్రీకి భర్తనే సర్వస్వంగా నిలబెట్టింది కనుక ఆ వ్యవస్థలోనున్న అసమ సంబంధాలలో స్త్రీ ఎప్పుడూ భర్త ఆదరణకోసం తహతహలాడుతూ తాపత్రయ పడుతూనే ఉండాల్సి వస్తుంది. భర్త వంశానికి వారసుడైన కొడుకు నివ్వటంద్వారా ఆ ఆదరణను పొందుతాననే ఆశతో ఉంటుంది. అది ఆనాటి పితృస్వామ్య సామాజిక వ్యవస్థా లక్షణం కనుక ఆ సమాజంలోని తోటి స్త్రీలకు కూడ అదేవిధమైన ఆలోచనలు, ఆశలు ఉంటాయి. కనుక కొడుకును కన్న స్త్రీని అభినందించటం వాళ్ళ స్వభావం అయింది. బహుభార్యాత్వం కల్గిన రాజు కుటుంబంలో కొడుకు పుట్టడం ఆయా భార్యల జీవితానికి ఒక భద్రత నిస్తుంది. రాజుకి ఉన్న అనేకానేకమంది భార్యలలో అతని వంశాన్ని నిలబెట్టే సంతానాన్ని ఇవ్వగల భార్య మాత్రమే రాజుకు సన్నిహితురాలు కాగలుగుతుంది. ఆ సాన్నిహిత్యం మిగిలిన భార్యలకంటె ఈమె కొక ప్రత్యేక స్థానాన్ని ఇస్తుంది. బహుభార్యాత్వం ఉన్నచోట అంతఃపురములలో ఒక అంతస్థులవారి ఆధిపత్య వ్యవస్థ ఉంటుంది. పట్టమహిషి, ప్రధాన దేవేరులు, ఇతర అంతఃపురకాంతలు ఒకరికంటె ఒకరు తక్కువ స్థితిగతులు, హోదా కలిగి ఉంటారు. వీళ్ళల్లో 'పిన్నయాలి' రాజుగారి ఆదరానికి ఎక్కువగా నోచుకోవాలంటే 'కొడుకుపుట్టటం' తప్పనిసరయింది. ఈవిధంగా 'కొడుకు పుట్టుక' గొప్పదనే విషయాన్ని గర్భీకరించుకొన్న ఈ కథలు పితృస్వామ్య వ్యవస్థా స్వభావాన్ని ప్రతిఫలించాయి.

## 2.2.2. పెంపకం :

ఇక జీవితంలో రెండవదశ 'పెరుగుదల'. ఈ దశలో మనిషి వ్యక్తిగా వికసించటానికి అవకాశాలన్నీ కలసివస్తాయి. ఐతే పుట్టుకతోనే స్త్రీపురుషుల మధ్య అసమానతలు ప్రారంభమైనపుడు వ్యక్తిత్వవికాసాల దశలోకూడ అవి కొనసాగటం, అనివార్యంగా జరుగుతుంది. వ్యక్తిత్వ వికాసానికి ప్రధానమైనది విద్య. కాని పితృస్వామిక సామాజిక వ్యవస్థలో ఆ విద్య స్త్రీ పురుషులకు సమానంగా అందుబాటులోకి రాదు. అందువల్లనే సింహాసన ద్వాత్రింశికలో తండ్రులు కొడుకుల చదువుల కోసం తహతహలాడిన కథలున్నాయికాని స్త్రీల చదువుగురించి ఆలోచించిన కథలే కనపడవు. తమ వారసత్వాన్ని పొందే కొడుకులకు సమాజ పరిజ్ఞానం అవసరమని భావించి తండ్రులు కొడుకులకు విద్యాధ్యయనం కోసం బయటకు పంపించటం, దానికోసం కొడుకులను తిట్టి నీతులు చెప్పటంకూడా కనబడుతుంది. తొమ్మిదవ

బొమ్మ చెప్పిన కథలో పురోహితుడు కొడుకైన కమలాకరుడితో విప్రులకు విద్యే భూషణమని (4-168) చెబుతూ 'చదువుల్ గట్టిగనెఱుగని పుత్రుడు పుట్టుట కులమునకు దెవ్వలు పుట్టుట (4-166) వంటిదని హెచ్చరించి అతనిని చదవటానికి ఉద్యుక్తుడ్ని చేస్తాడు. 'విద్యలు నేర్చి వివేకినై కాని' (4-173) తిరిగిరానని కమలాకరుడు ఇల్లు వదలి వెళ్ళిపోతాడు. అంటే ఇక్కడ విద్య వివేకాన్ని కల్గిస్తుంది అని స్పష్టంగా తెలిసిన సమాజంలో కూడ అవిద్యవల్ల కలిగే వివేకం పురుషుడికే అవసరం కాని స్త్రీలకు అవసరం లేదని పితృస్వామిక సమాజం భావించటం కనబడుతుంది.

అట్లాగే ఇరువది ఒకటవ బొమ్మ చెప్పిన కథలో గ్రహిలుడ్ని కూడ అతని తండ్రి చదువుయొక్క ప్రాముఖ్యాన్ని చెప్పి బయటకు పంపుతాడు. కొడుకుల విషయములో కొడుకుగా పుట్టనందుకు 'గట్టియైన యెఱుకపట్టు'లేకపోవటం(8-188) తల్లిదండ్రులకు వృధాకారణం అవుతుంది. పురుషుడి జన్మసార్థక్యం విద్యద్వారా ప్రజ్ఞను పొందటంలోనే ఉంది. ప్రజ్ఞ లేని బిడ్డను కనడంకంటె 'సతి గొడ్రాలైన మేలే' అని అనుకొనే దశలోకూడ మానవజాతిలోనే కొందరికి స్త్రీలుగాపుట్టినందుకు ఆ 'ఎఱుక' పొందే అవకాశమే లేకపోవటం గమనించవచ్చు. పురుషులు సామాజిక ఉత్పత్తి కార్యకలాపాలలో భాగస్వాములై తండ్రి ఆస్తికి వారసత్వం పొందే ఆర్థిక వ్యవస్థ మాత్రమే కాక 'పరదా' వంటి ఉపరితల సాంఘిక కారణాలుకూడ స్త్రీ విద్యకు ప్రతిబంధకాలైనవి. ప్రథమాశ్వాసంలో శారదానందుడు రాజు కొడుకును కాపాడే సందర్భంలో స్త్రీల విషయంలో అమలులోనున్న 'పరదా' పద్ధతిని అతను ఉపయోగించుకోవటం కనబడుతుంది. (1-297), (1-307) ఇంటి వాకిలి కూడ తెలియనంతగా గృహాంతర్భాగంలో జీవించే 'ఘోషా'సంస్కృతి ఉన్నసమాజంలో స్త్రీకి సామాజిక విద్యకు అవకాశంలేకుండా పోయింది.

స్త్రీలను గురించి వాళ్ళు ఏ రకమైన వివేకం, ఎఱుక లేనివాళ్ళని అనుకోకూడదు. ఐతే సామాజికజీవితం ప్రతి వ్యక్తికి వాళ్ళవాళ్ళ పరిధులనుబట్టి 'ఎఱుకను' సమగ్రం చేస్తుంది. కాని పురుషులు పొందటానికి వీలున్న ఎఱుకకు, స్త్రీలు పొందటానికి ఉన్న ఎఱుకకు పితృస్వామిక వ్యవస్థలో పరిజ్ఞానపరమైన వైరుధ్యం ఉంది. సామాజిక ఉత్పత్తి కార్యకలాపాలలో భాగస్వామ్యానికి సంబంధించిన సామాజిక సంస్కృతిని, విలువలను నిర్మించగలిగిన, నిర్దేశించగలిగిన ఎఱుక పురుషులకు లభిస్తుండగా కుటుంబ పరిధిలో పురుష ప్రయోజనాల కనుకూలమైన ప్రవర్తనను అలవర్చుకోవటానికి అనువైన ఎఱుక స్త్రీలకు లభిస్తున్నది. కనుకనే స్త్రీల జ్ఞాన

మంతా దైవభక్తిని, పతిభక్తిని అభివృద్ధి చేసుకోవటానికి (4-60) తన జీవితంలో ప్రవేశించబోయే భర్త ఎవరో నిర్ణయంకాక ముందునుండే, పుట్టినది మొదలుగ పెరిగే క్రమంలో 'భర్తతోడిదే జీవితమన్న ఎఱుకను' అభివృద్ధి చేయట మన్నది కుటుంబ వ్యవస్థా లక్ష్యంగా ఉంటుంది. అందుకనే పదకొండవ బొమ్మ చెప్పిన కథలో మలయవతి తన భర్త అయిన జీమూతవాహనుడు పునరుజ్జీవితుడైనప్పుడు పార్వతిని స్తుతించిన సందర్భంలో ఐదవతనం కోసం 'గరళము మింగిన పతికి స్మరణము దప్పించి మెఱయ మంగళ సూత్రాభరణముగల దేవత' (5-263) కు నిత్య పరిచర్యలు చేసిన సంగతి స్పష్టమవుతుంది. ఆమె భర్త మనస్సును రంజింప చేయగల వీణాగాన విద్యతోపాటు, భర్త ఆయుష్షుకు భద్రతనిస్తుందనే విశ్వాసంతో సాంప్రదాయక, సాంస్కృతిక దైవారాధనా విధానాన్ని కూడ 'విద్యగా' అభ్యసించింది. అంటే పితృస్వామిక సామాజిక విలువలను పరిరక్షించగలిగే సాంస్కృతిక గృహ విద్యను నిర్దేశించగా, ఆ పితృస్వామిక విలువలను, పరిరక్షించగల సాంస్కృతిక గృహ విద్యను స్త్రీలకు ప్రత్యామ్నాయ విద్యగా నిర్దేశించటం జరిగింది.[22]

## 2.2.3. వివాహం :-

సంతానాన్ని కని పురుషుడి వంశాన్ని పారంపర్యంగా కొనసాగించటం స్త్రీ ధర్మంగా నిర్దేశించిన పితృస్వామ్య సమాజం జంట పెళ్ళి వ్యవస్థను దంపతీ వ్యవస్థగా పరిణమింపచేసింది. జంట పెళ్ళి వ్యవస్థ దంపతి వ్యవస్థగా మారుతున్న సంధిదశను చూపించటం దగ్గరనుంచి ప్రారంభించి దంపతి వివాహాలలో స్త్రీ పురుష సంబంధాలు రకరకాలుగా స్థిరపడటాన్ని చూపించటం వరకూ ఉన్న సామాజిక స్థితిగతులను చిత్రించే పెళ్ళిళ్ళు ఆయ జంటల మధ్య జరిగినవి సింహాసన ద్వాత్రింశికలో కనబడతాయి, అవి సులోచన - గౌళికుల పెళ్ళి (3వ బొమ్మ), పద్మావతి-రత్నాదవుల పెళ్ళి (7వ బొమ్మ), కుముద్వాలి - చంద్రకేతుల పెళ్ళి (7వ బొమ్మ) మలయవతి - జీమూతవాహనుల పెళ్ళి (11వ బొమ్మ), ప్రకాశినీ - మతిమంతుల పెళ్ళి (27వ బొమ్మ), పద్మావతి - వజ్రముకుటుల (31వ బొమ్మ) పెళ్ళిళ్ళు.

పద్మావతి - వజ్రముకుటులు ఒక జంటగా ఏర్పడటంలో మొదటి చూపులోనే ఏర్పడిన అన్యోన్య ఆకర్షణ ఎంత కారణమో ఆ ఆకర్షణ భౌతిక సంబంధాల లోకి కావటానికి పద్మావతి చూపించిన చొరవ అంతకారణం. చొరవ చూపించటమే కాక తనపట్ల అతని ప్రేమ ఎంత స్థిరమైందో తెలిసికోవటానికి పద్మావతి చాతుర్యంతో ప్రవర్తించింది. ఆ రకంగా వారు పరస్పరాకర్షణతో జంటపెళ్ళి సంబంధాలతో

స్థిరపడ్డారు. అందువల్లనే పద్మావతి తండ్రి ప్రమేయం ఇక్కడ కనబడదు. ఇద్దరూ కొంతకాలం కలిసి ఉన్న తరువాత వజ్రముకుటుడికి తనతోపాటు ఆ ఊరికి వచ్చిన వాని ఇంట్లో గుప్తంగా ఉన్న మంత్రి కుమారుడు గుర్తొచ్చాడు. ఆ విషయం పద్మావతికి తెలియచేస్తాడు. మంత్రికుమారుడ్ని చూసి విందు చేసిరమ్మని, ఆహార పదార్థములు ఇచ్చి పంపించింది పద్మావతి. ఆ ఆహారం విషమయం కావటం గమనించిన మంత్రి కుమారుడు 'తమమీద చిత్తంబు తరలుగాక, సతులిష్ట చెలికాని సైచరసి' (1246) చెప్పి తాగి మత్తిల్లి ఉన్న పద్మావతి తొడమీద మూడు గాట్లు చేసి ఆమె పాదభూషణం తీసికొని రమ్మని వజ్రముకుటుడిని పంపించాడు. వజ్రముకుటుడు ఆ ప్రకారం చేసిన తరువాత మంత్రి కుమారుడు తాను యతివేషం ధరించి ఆ పాదభూషణం అమ్మే ప్రయత్నం చేయమనీ, ఆ భూషణం వివరాలెవరైనా అడిగితే తన దగ్గరకు తీసుకురమ్మనీ చెప్పి పంపాడు. ఆభరణపు జాడను గురించి తెలుసుకోవటానికి తన దగ్గరకు వచ్చిన చారులతో తాను యతి కనుక ఆ రాజునే తన దగ్గరకు రమ్మని కబురుచేస్తాడు. వచ్చిన రాజుతో అతని కొడుకును చంపిన ఆమె యొక్క పాదభూషణ మిదియని, ఆ చంపిన స్త్రీ ఢాకిని జాతికి చెందినదని చెప్పి రాజుచేతనే పద్మావతిని దేశం నుండి వెళ్ళగొట్టించాడు. దేశ బహిష్కరణకు గురియై ప్రాణత్యాగం చేయటానికి సిద్ధపడ్డ పద్మావతిని ఊరడించి రాజకుమారుడు ఆమెను తన రాజ్యానికి తీసుకొని వెడతాడు. కూతురి ఎడబాటుతో దుఃఖితులైన తల్లి దండ్రులిద్దరూ నాల్గు రోజుల్లో మరణించారు.

రాజు తప్పొప్పులను సరిగా విచారించకుండా తనకున్న శిక్షాధికారాన్ని వినియోగించటం పాపమని చెప్పటం కోసం భేతాళుడి చేత విక్రమార్కునికి ఈ కథను గోపరాజు చెప్పించాడు. కాని ఈ కథను స్త్రీ జనజీవిత దృక్పథంనుండి చూసినపుడు పితృస్వామ్య వ్యవస్థ స్పష్టమైన రూపం తీసుకుంటూ స్త్రీ పురుషుల మధ్య జంటపెళ్ళి సంబంధాలు దంపతీ సంబంధాలుగా పరిణమిస్తున్న సంధికాలపు స్వభావాన్ని వ్యక్తం చేస్తోందని భావించవచ్చును.[23]

పద్మావతి వజ్రముకుటులు వాళ్ళ వ్యక్తిగత ఇష్టాల కారణంగా, పెద్దల ప్రమేయం లేకుండా వివాహంలాంటి తంతుతో నిమిత్తం లేకుండా పద్మావతి ఇంట్లో జంటకూడి ఉన్నారు. ఈ స్థితి జంటపెళ్ళి వ్యవస్థను గుర్తు తెచ్చేదిగా ఉంది. స్త్రీ పురుష సంబంధాలలోని వివిధ దశల పరిణామ క్రమంలో ప్రాచీన కాలం నుంచి అనుశ్రుతంగా వస్తున్న సమిష్టి గృహ వ్యవస్థలో స్త్రీల భర్తలందరూ ఇతర గణాలనుంచే వస్తారు. ఇది కుటుంబంలో ఆడవాళ్ళ పెత్తనం ఉండటానికి భౌతిక

కారణంగా ఉంటుంది.[24] అందువల్లనే వజ్రముకుటుడు పద్మావతి ఇంటికి వచ్చి ఆమెతో జంట సంబంధాలతో ప్రవర్తిస్తున్నాడు. కనుక వజ్రముకుటుని మీద పద్మావతికి పెత్తనం ఏర్పడటానికి అవకాశం ఉంటుంది. అది పితృస్వామ్య వ్యవస్థ అస్తిత్వానికి వ్యతిరేకం. అందువల్ల పద్మావతి వజ్రముకుటుడు కలిసి ఉన్న భౌతిక వాతావరణంలో మార్పు జరిగితే తప్ప పద్మావతి పెత్తనం నుండి అతన్ని తప్పించటానికి వీల్లేదు. కాబట్టే మంత్రి కుమారుడు పిషాహార నెపంతో ఆ వ్యవస్థనుండి రాజకుమారుడ్ని తప్పించటమే కాక, ఆ దేశపు రాజకుమారుడ్ని చంపిందన్న నిందను ఆరోపించి నిరూపింపచేయటం ద్వారా, ఆమెను ఉన్న ప్రదేశం నుండి బయటకు తెప్పించి, రాజకుమారుడితోపాటు అతని రాజ్యానికి వచ్చేటట్లు చేయగలిగాడు. ఆ రకంగా పద్మావతికి స్థానబలంలేకుండా చేసి భౌతికంగా ఆమెను నిస్సహాయురాలిని చేసి రాజకుమారుడి వెంటవచ్చి అతనితో అతని ప్రదేశంలో స్థిర పడక తప్పని పరిస్థితిని కల్పించాడు.[25]

ఈ పెళ్ళిళ్ళను నిర్ణయించటంలోనూ, నిర్వహించటంలోనూ పెద్దలు ప్రముఖపాత్ర వహిస్తారు. మగపిల్లలు అడపాదడపానైనా తల్లిదండ్రుల ప్రమేయం లేకుండా పెళ్ళి చేసుకోవటాన్ని పితృస్వామ్య సామాజిక వ్యవస్థ అనుమతిస్తుందిగాని ఆడపిల్లల పెళ్ళి నిర్ణయంలో పెద్దలపాత్ర మరీ ఎక్కువ. అది ప్రేమ వివాహమైనా, స్వయంవర ఛాయకల్గిన పద్ధతిలో పెళ్ళిళ్లలోనయినా పెద్దల ఆమోదం అనివార్యం అవుతుంది.

ఈ పెళ్ళిళ్ళల్లో మలయవతి జీమూతవాహనులది ప్రేమ ప్రాతిపదికగా గల పెళ్ళి. స్త్రీ పురుషుల మధ్య ప్రేమ దంపతి వివాహ వ్యవస్థలోనే తలయెత్తింది. ప్రేమ చరిత్రలో ప్రప్రథమంగా మోహం రూపంలో కన్పడుతుంది. లైంగికవాంఛ కది ఉత్తమ రూపంగా గుర్తించబడింది.[26] ఈ విధమైన ప్రేమ ప్రారంభమై అది వైవాహిక వ్యవస్థలో ధర్మ సమ్మతం కావటం జరగవచ్చు. లేకపోతే వైవాహిక వ్యవస్థ ద్వారా ఇద్దరూ జీవితాంతం కలిసి ఉండటానికి ఏర్పడిన అవకాశాలవల్ల స్త్రీ పురుషుల మధ్య ప్రేమ అభివృద్ధి పొందవచ్చు. మలయవతి జీమూతవాహనుల విషయంలో వివాహానికి పూర్వమే ఏర్పడిన ప్రేమ, వివాహ వ్యవస్థలో మరింత బల పడి కొనసాగటం కనబడుతుంది. ఐతే దంపతీ వివాహ వ్యవస్థలో స్త్రీ పురుషులు ప్రేమ సంబంధాలలోకి రావటానికి వాళ్ళు చూపే సొంత చైతన్యం, చొరవా కాకుండా పెద్దల ఎంపిక ప్రధాన కారణం అవుతుంది. ఒక్కొక్కప్పుడు ఈ సంబంధాలు పురుషుల చొరవతో ఏర్పడట్కం కూడ ఉంది. కాని పితృస్వామ్య సమాజంలో

స్త్రీల వ్యక్తిత్వానికి గుర్తింపు లేకపోవడం కారణంగా ఈ ప్రేమ వివాహాలలో స్త్రీల వేపునుండి చొరవ చూపించటానికి అనేక అభ్యంతరాలుంటాయి. అందు వల్లనే మలయవతి బాల్యంలో తండ్రి ఒద్దికలో బ్రతకాల్సిన స్త్రీ అయింది. తండ్రి నిర్ణయంతో నిమిత్తం లేకుండా తానెవరినైనా ప్రేమించటం కాని, ప్రేమించానని చెప్పటంకాని కుటుంబ పెద్దయైన తండ్రికి కోప కారణం అవుతాయి (5-152). అందుకే మలయవతి జీమూతవాహనుని ప్రేమించిన సంగతి ఆమెగాని, ఆమె చెలిక తైలుగాని రాజుకు తెలియజేయటానికి సందేహించారు. తన ప్రేమను తండ్రి కెరింగించటానికి ధైర్యం చాలక చివరికి ఆత్మహత్యకు కూడా సిద్ధపడుతుంది-మల యవతి. ఐతే ఆ తండ్రి ఉదారస్వభావంతో కూతురి ప్రేమ కథాసంగతిని అర్థం చేసుకొని వీళ్ళ వివాహానికి అంగీకరించాడు. కూతురి ప్రేమను తానామోదించటమే కాక జీమూతవాహనుని తండ్రి అనుమతినీ సంపాదించి వాళ్ళ వివాహాన్ని జరిపించాడు.

ఇక్కడ మలయవతి-జీమూతవాహనులు ప్రేమించుకున్నా వాళ్ళిద్దరూ ఏ సొంత చొరవతో పెద్దల ప్రమేయం లేకుండా మాత్రం పెళ్ళి చేసుకోలేదు. పెద్దలు తమంతట తాము అంగీకరించి పెళ్ళి జరిపించేవరకు పెళ్ళి అవుతుందోకాదోనని ఆందోళన పడ్డారేకాని పెళ్ళి చేసుకునేందుకు ఎటువంటి ప్రయత్నము చేయలేదు. మలయవతి జీమూతవాహనుల పెళ్ళికి ప్రేమ ప్రాతిపదిక అయినప్పటికి రూపంలో ఆపెళ్ళి మాత్రం సాంప్రదాయ పద్ధతిలో తండ్రి తన కూతుని వరునికిచ్చి చేసిన (5-180) పద్ధతిలోనే జరిగింది. ఈ పెళ్ళి ప్రాజాపత్యా వివాహ స్వభావంతో కనపడుతుంది. పెద్దవాళ్ళు తామంతట తామే నిర్ణయించిన పెళ్ళిళ్ళల్లో స్త్రీల ఇష్టా నిష్టాలతో నిమిత్తంలేదు. ఏడవ బొమ్మ కథలో పద్మావతిని పెళ్ళాడాలని వచ్చిన చంద్రకేతుడిని తన కూతురు నిరాకరించటంచేత అతను పొందిన ఆశా భంగంనుండి ఊరట కలిగించటానికి పెట్టి తన తమ్ముని కూతురగు కుముద్వతిని అతని కిచ్చి వివాహం చేస్తాడు. పెద్దలు కుదిర్చి చేసే వివాహాలలో కూతురినిష్టా తామనుకున్న వరుడికిచ్చి పెళ్ళి చేయటమే కాకుండా తామనుకున్న ఏ కొద్దిమంది నుండో ఒకర్ని ఎన్నిక చేసుకొనే స్వేచ్ఛను ఆడపిల్లకు ఇచ్చిన కథలుకూడా ఇందులో ఉన్నాయి. ఇవి పూర్తిగా స్వయంవర వివాహ పద్ధతిలో జరిగిన వివాహా లనలేము కాని ఆ ఛాయలు వీటిలో కొద్దిగా కనపడతాయి.

పద్మావతిని పెళ్ళాడాలని చంద్రకేతువు, రత్నోద్భవుడు పోటీపడి వచ్చారు. వారిద్దరిలో పిల్లను ఎవ్వరి కివ్వాలా అన్న సందేహం కలిగినపుడు తండ్రి కూతురి ఎంపికకు ప్రాధాన్యం ఇచ్చాడు. 'ఇద్దరి పెళ్ళి జావలుం చరితములున్ దగంతెలిసి

సామ్యము కల్గిన వీరిలోన నెవ్వరినవుగాదనంజను వివాదము బాలిక చేత దీరెడున్' (4-54) అని అనుకున్నాడు. పద్మావతి రత్నోద్భవుడ్ని భర్తగా 'అవునని' ఎన్నుకొని తండ్రి సమస్యను తీర్చింది.

పద్మావతి విషయం చూస్తే 'స్త్రీ'కి భర్తని ఎంపిక చేసుకోవటంలో స్వాతంత్ర్యమున్నట్లు కనబడినప్పటికీ ఆ ఎంపిక కూడ పితృస్వామ్య సమాజం నిర్ణయించిన కుటుంబ పరిధిలోనే, తండ్రి ఆధ్వర్యంలో, తన గడపలోనికి వచ్చిన వారిలో మాత్రమే జరిగింది. అంతకుమించి స్వేచ్ఛగా బయట ప్రపంచంలోకి వెళ్ళి ఎన్నుకున్నవి కావు.

మూడవ బొమ్మ కథలో బృహత్సేనుడి కూతురు సులోచన గొప్ప సౌందర్యవతియై, తనకు భర్తగా ఏ రాజనందనుని మెచ్చక ఉన్న స్థితిలో తాను కృష్ణుడినంటూ వచ్చిన విటుడైన గౌళికుడ్ని పెళ్ళాడటానికి నిర్ణయించుకొనగానే అందుకు తండ్రి 'తడయక గైకొనమని' అనుజ్ఞ ఇచ్చాడు. పితృస్వామ్య వ్యవస్థలో ఆడపిల్లలు తమ సౌందర్య జ్ఞానమే పరిజ్ఞానంగా బ్రతుకుతూ స్త్రీ పురుష సంబంధాల నిర్ణయంలో అదొక్కటే ప్రధానమన్న భావనలో ఉన్నారు. కాబట్టి సామాజిక లౌకిక జ్ఞానం లేకపోవటం చేతే స్త్రీలు సులభంగా వంచనలకు గురి అవుతున్నారు. సులోచన విషయంలో జరిగింది కూడ అంతే. తన సౌందర్యాని కెవరూ సరితూగే వారు లేరనుకొని లోకంలో ఉన్న రాజనందనులను తిరస్కరిస్తున్నపుడు, ఈ లోకంనుంచి ఒకడు తాను అలౌకికుండంటూ వచ్చి ఆమెను నమ్మించగలిగాడు. అంటే పితృస్వామ్య సమాజంలో స్త్రీల అహంకారాన్ని మించగలిగింది, ఈ పురుషాహంకార వంచన. కానీ ఈ కథలో విచిత్రమేమంటే సులోచనకు తాను వంచింపబడ్డానన్న విషయం అసలెప్పటికీ తెలీదు. తెలియక పోవటానికి కారణం కథా నిర్మాణంలో రచయిత అవలంబించిన దృక్పథం. పితృస్వామ్య సమాజంలో స్త్రీలు వంచనకు గురి కావటానికున్న పరిస్థితులను గురించి చెప్పటానికంటె తనను నమ్ముకొన్న వాడికి భగవంతుడు సహాయకారిగా ఉంటాడనే విషయాన్ని ప్రస్ఫుటం చేయటమే ఇక్కడ కవి ఉద్దేశం.

కావ్యంలో ప్రకాశిని మతిమంతుల పెళ్ళికూడా పెద్దలు చేసినదే. కాని ప్రకాశిని మతిమంతుల పెళ్ళిలోనూ, పద్మావతి వజ్రముకుటుల పెళ్ళిలోనూ స్త్రీల వైపునుండి చొరవ ఉండటం ఆ పెళ్ళిళ్ళు కావటానికి ప్రధాన కారణం. ప్రకాశిని దొంగతనమనే నేరారోపణవల్ల కాళ్ళు, చేతులు నరికివేయబడ్డ మతిమంతుడిపట్ల అతని గానంవల్ల ఆకర్షితురాలైంది. అతనిని తన అంతఃపురానికి తీసుకురమ్మని దాదిని

హరిపించింది. దానివల్ల అతని విరూపం తెలిసినాకూడా తరువాత తాను స్వయంగా చూసినాకూడ ఆ ఆకర్షణ ఆమెకేమీ తగ్గలేదు. అందువల్లనే అతనిని తండ్రి అనుమతితో తన భర్తగా చేసుకోవాలనుకుంటుంది. తండ్రి అందుకు అంగీకరించడు. ఐనా ఆమె మతిమంతుణ్ణి తన అంతఃపురానికి తీసుకొచ్చుకుంటుంది. తనని తాను అతనికి సమర్పించుకుంటుంది.

ఈ పెళ్ళిలో ప్రకాశినికి మతిమంతుడి పట్ల గల మోహం వీరిద్దరి సంబంధానికి ప్రాతిపదిక అయింది. దాంపత్య ప్రేమ యొక్క ప్రారంభ రూపంగా మోహాన్ని అర్థం చేసుకోవాలి. ప్రకాశినికి మతిమంతునిపై నున్న మోహంలో లైంగిక వాంఛా స్పర్శకూడ ఉంది.[27] అందుకే అతణ్ని చూసిన మొదటిసారి తనను మరచి అతనిపై పడబోయింది. తండ్రి కిష్టంలేకపోయినా తన అంతఃపురానికి తీసుకొనివచ్చి తనని అతనికి సొమ్ముగా సమర్పించుకుంది, అయితే ప్రకాశినికి ఉన్న మోహలక్షణానికి శారీరక వాంఛ ఒక్కటే అంతిమ గమ్యంగాదు. ఎందుకంటే కాళ్ళు చేతులు లేకుండా రోతపుట్టేటట్లున్న మొండెంలా పడి ఉన్న వాడిని తన మేడకు తీసుకు వెళ్తుంటే ప్రజలు తనను చూసి నవ్వినా పట్టించుకోలేదు. రాజు కూతురిగా ప్రకాశినికి ఇంతకంటే అందగాడు భర్తగా లభించే అవకాశం ఉంది. ప్రకాశిని మతిమంతుడి ఆకారంపట్ల కంటె కూడ అతని గానంపట్ల, 'తెలివి నెరక దేహ దీప్తి' (0-182) కలిగియున్న అతనిపట్ల ఆకర్షితురాలైంది. వాటిని అతనితో నిత్య సాన్నిధ్యంతో మాత్రమే తన అనుభవంలోకి తెచ్చుకోగలుగుతుంది. ఆ సాన్నిహిత్యం కోసమే అతనిని భర్తగా వరించింది. ఉన్నతమైన దాంపత్య సంబంధాలకు బీజం మోహం రూపంలో ఉంటుందని ఈ కథ చెప్పకనే చెబుతుంది.

స్త్రీ పురుషులు ఒకరికొకరు జీవితాంతం నిబద్ధులై పిల్లల్నికని పెంచటం, తమ వంశవారసులుగా వారిని తీర్చి దిద్దటం ప్రధాన లక్షణంగా రూపొందించిన దంపతీ వివాహవ్యవస్థలో జీవితాంత సాహచర్య సహజీవనాల కారణంగా అంతకుముందున్న వ్యవస్థలలోని ప్రేమ అభివృద్ధి చెందటానికి వీలేర్పడింది. కాని అదే సమయంలో దంపతీ వ్యవస్థలో స్త్రీ పురుషులను అసమానులుగా చేసిన పితృస్వామ్య సామాజిక స్వభావమే ఆ ప్రేమ పుట్టుకకి అభ్యంతరం అయింది. పైగా దంపతీ వివాహ వ్యవస్థలోని అంతకు ముందున్న వ్యవస్థల్లో లేని ధనం స్త్రీ పురుష సంబంధాలలోకి ఒక నిర్ణాయకాంశంగా వచ్చి చేరింది. అది అరణం రూపంలో, స్త్రీ ధన రూపంలో, కట్నంరూపంలో ఓలి రూపంలో ఉండవచ్చు. సింహాసన ద్వాత్రింశికలో పురుషుడు

పొందిన 'ఓలి' నిచ్చి స్త్రీని పొందిన కథలేవీ లేవు. కట్నం కూడ ప్రధానేతివృత్తాలలో ప్రధానాంశంగా ఎక్కడా చోటుచేసుకోలేదు. కాని కుముద్వతి పెళ్ళి విషయంతో 'అరణం'(4-65) ప్రస్తావన వున్నది. సెట్టి చంద్రకేతుడికి కుముద్వతి నిచ్చి పెళ్ళి చేస్తూ సువర్ణలక్షధనము అరణంగా(4-65) ఇచ్చాడు. పెళ్ళి సమయంలో తండ్రి తన స్థితిగతుల్ని బట్టి కూతురికి అల్లుడికి ఇచ్చే కట్నకానుకలు కలిసి అరణ మనబడుతుంది. ఇంతేకాక వసంతోత్సవానంతరం ఒక విప్రుడు వచ్చి విక్రమార్కుడ్ని, 'రాజ! దీని పెళ్ళి చెయ్యవయ్య' (7-75) పెళ్ళి నిమిత్తం ఖర్చుకై రాజును యాచించినట్లు కలదు. ఇక్కడ జరిగినది బాల్యవివాహం. దంపతీ వ్యవస్థకు ముందున్న స్త్రీ పురుష సంబంధ వ్యవస్థగా స్త్రీకి పురుషుడితో పాటు ఎంతో కొంత సంపద ఉంది. జంట పెళ్ళి వ్యవస్థలో కూడ తమకిష్టంలేక విడిపోయేటప్పుడు స్త్రీ పురుషులు తమ తమ సంపదలతో కూడ విడిపోయేవారు. సంపదమీద పురుషుడి హక్కు ఏర్పడిన సామాజిక నిర్మాణంలో భాగంగా దంపతీ వ్యవస్థ వచ్చేసరికి, స్త్రీకి వ్యక్తిగత ఆస్తి లేకుండా పోయింది. ఈ నష్టానికి పరిహారంగా, దంపతీ సంబంధాలలోకి వచ్చే స్త్రీ పురుషుల మధ్య ఉండే అసమానతకు ఒక పరిహార ప్రక్రియగా అరణాలు, కట్న కానుకలు వచ్చి ఉంటాయి. ఐతే పితృస్వామిక సామాజిక వ్యవస్థాస్వభావ కారణంగా కట్నాల రూపంలో, అరణాల రూపంలో తండ్రినుండి సంక్రమించే ధనంపై స్త్రీకి ఉండాల్సిన హక్కు లేకుండా పోతుంది. 'స్త్రీ' యే పురుషుడి సంపదలో భాగమైపోయిన వ్యవస్థలో స్త్రీ సంపద ప్రత్యేక ఆస్తిత్వంలో ఉండే అవకాశం లేదు. కాబట్టి అదికూడ పురుషుడి సంపదే అవుతుంది. ఇరువదిఏడవ బొమ్మ కథలో మతిమంతుడ్ని అంతఃపురానికి తీసుకొని వెళ్ళిన ప్రకాశిని 'తన్ను అతని సొమ్ము చేసె (10-139) అని చెప్పడం ద్వారా, కవి పితృస్వామ్య సదూజంలో స్త్రీ పురుష సంబంధ వ్యవస్థ స్త్రీని పురుషుడి సొమ్ముగా చేసిన పరిస్థితిని అర్థం చేసుకోవటానికి అవకాశం కల్పించాడు.

పితృస్వామిక సమాజంలోని స్త్రీ పురుషులమధ్య అసమానతలు, దాంపత్య సంబంధాలలో స్త్రీని పురుషుడికి దాసిగా చేయటంలో ప్రతిఫలిస్తుంది. పదిహేనవ బొమ్మ చెప్పిన కథలో 'తప్తతైల కటాహము'లోకి దుమికిన తెగువరియైన విక్రమార్కుని సంజీవనీ కన్య బ్రతికించి, అతని సాహసానికి మెచ్చి, తన వ్రతం ఫలించిందని చెప్పి 'తగు దాసినైతి గరుణింపుము' అని కోరి 'రాజ్యమనుగ్రహింపు సంప్రీతి మొనయుదాన' అనిచెప్పి అతని ఆజ్ఞకొరకు వేడుకొంటుంది. పైపెచ్చు 'తగురీత ననుంబనివంపు మిత్తతిన్' అని (6-138). అప్పుడు విక్రమార్కుడు

'నావు డుదాసివేని... ధరణీ దేవుని సు|శితునా|శయింపు' మని (6-139) చెప్పగా, ఆమె వి|కమార్కుడు చెప్పిన |ప్రకారమే వి|ప్రుడ్ని వరిస్తుంది. ఈ కథలో తనదైన స్వంతరాజ్యం ఉండి పాలనాధికారం కల్గిన కన్య వి|కమార్కుని ముందు 'దాసి' నన్న భావాన్ని చూపించింది. 'భార్య' అంటే ఆమె ఆర్థికంగా ఎంత ఉన్నతస్థితిలో ఉన్నా దాసీ స్థాయికి మించదు. భార్యను దాసిగా చేసిన పితృస్వామ్య వ్యవస్థ స్త్రీ తనకుతానే "దాసి"గా అనుకునే సాంస్కృతిక స్థాయికి తీసుకువస్తుంది. దాంపత్యం అంటే స్త్రీవైపునుండి 'దాసత్వం' అని చెప్పుకోవచ్చు. ఫ్యూడల్ వ్యవస్థకు ముందున్న బానిస వ్యవస్థ అంతరించినప్పటికీ అర్థ బానిస వ్యవస్థా స్వభావాన్ని కొనసాగింప చేస్తున్న భూస్వామ్య భావజాల|ప్రభావం వల్ల స్త్రీ తనకితాను పూర్తిగా 'దాసి'గా భావించుకొని పురుషుడి ముందు తనను తాను సమర్పించుకుంది. తానంత పరాధీను రాలు కనుకనే భర్తపట్ల ఆమెకు వినయం ఒక |ప్రత్యేక లక్షణంగా అవసరం అవుతుంది.

నాల్గవ బొమ్మ చెప్పిన కథలో సంతానార్థియైన విలోచన సంతానం కోసం భర్తతో 'వినయం జెనయం' (3-9) ఈశ్వరుడ్ని ఆరాధించమని అడుగుతుంది. అంటే దాంపత్య వ్యవస్థలో స్త్రీ పురుషులలో వారిద్దరికి సంబంధించిన సంతాన విషయం |ప్రస్తావన వచ్చినప్పుడుకూడ భర్తముందు 'వినయం' |ప్రకటించుకోవాల్సిన స్థితిలోనే స్త్రీని ఉంచబడుతుంది. ఈ సామాజిక చారి|త్రక పరిస్థితియే విలోచనను భర్తపట్ల అంత వినయాన్ని |ప్రదర్శించేటట్లు తయారుచేసింది. స్త్రీలు ఆ మా|త్రము వినయంగా ఉన్నప్పుడు మా|త్రమే పురుషులు వాళ్ళ మాటను ఏకొద్ది అంగీకారంతో నైనా వినటానికి అవకాశం ఉంది. ఇది ఉదారస్వభావం కలవాడు కనుకనే 'స్త్రీ బుద్ధి'యని నిర్లక్ష్యంచేయక తానుత్సాహకుడై భార్య మాటను అంగీకరించడం జరిగింది. పురుషుడు తన కవసరమైన తన స్వ|ప్రయోజనాల కనుకూలమైన సంద ర్భాలలో సైతం స్త్రీ వినయంతో చెప్పుకొన్న మాటలను మా|త్రమే ఆదరించ గల్గుతాడు.

అదేవిధంగా |ప్రథమాశ్వాసంలో కూడ ఒక వేద |బాహ్మణుడు తపస్సుచేసి 'అమరత్వ'మిచ్చు ఫలాన్ని వర|ప్రసాదంగా పొంది దానిని తీసుకొనివచ్చి భార్యకివ్వగా దారి|ద్ర దుఃఖపీడిత కనుక ఆ ఫలం తమ అవసరాన్ని, ఆకలినితీర్చలేదని |గ్రహించి దానినెవరికైనా ఇచ్చి తగినంత ధనం తీసుకురమ్మని భర్తకు సలహా ఇస్తుంది. ఆ సలహా ఇచ్చేటపుడు మదిలో 'స్త్రీ బుద్ధియనక మన్నింపదగునని' అని తన మాటకు విలువనిచ్చి |ప్రవర్తించమని నొక్కిచెబుతుంది. ఆమె అట్లా చెప్పటానికి 'స్త్రీ బుద్ధికి

ప్రళయాంతకః' అని స్త్రీ బుద్ధిని తక్కువగా అంచనా వేసి వినాశకారిగా ప్రచారం చేసిన పితృస్వామ్య వ్యవస్థను నిలబెడుతున్న భావజాలమే కారణం. ఈ భావజాల ప్రభావం వల్లనే జీవన సహచరులైన భార్యల ఆలోచనలను, అభిప్రాయాలను పూర్తిగా నిర్లక్ష్యంచేసి భర్తలు ప్రవర్తించటంకూడ కనబడుతుంది. ఇందుకు నిదర్శనంగా పదునాల్గవ బొమ్మ చెప్పిన కథలోని 'రాజనే ఓరుదుకు దైవబలం గొప్పదా, ఉద్యమ బలం గొప్పదా' అని విక్రమార్కుడికి వచ్చిన సందేహాన్ని నివారించటానికై యోగి చెప్పిన కథకు నాయకుడు రాజశేఖరుడు. తన ప్రయత్నమేమీ లేకుండా యత్నులవల్ల రాజ్యాన్ని పొందిన రాజశేఖరుడు శత్రువులవల్ల తన రాజ్యానికి ముప్పు వచ్చినా కూడా ఆ రాజ్యాన్ని నిలుపుకోవటానికి తానెటువంటి ఉద్యమాన్ని చేపట్టడు. ఆ సందర్భంలో అతని భార్య పాచికలాడుతున్న సమయంలో వినోద వేళలో తన కున్న ధనువును ఉపయోగించుకొని రాజ్య రక్షణకై శత్రువులతో యుద్ధానికి సిద్ధం కమ్మని సలహా ఇస్తుంది. కాని రాజశేఖరుడు ఆమె మాటలనేమి పరిగణనలోనికి తీసుకోలేదు. స్త్రీలకు రాజకీయాది విషయాలను అవగాహన చేసుకొని ఆయా విషయాలకు సంబంధించి తగిన సలహా లివ్వగలిగిన తెలివితేటలు, సామర్థ్యం ఉన్నప్పటికీ, వాటికి సార్థక్యం పురుషులు పట్టించుకొని ఆచరణలోకి తేగలిగినప్పుడే-విలోచనుడు, వేదబ్రాహ్మణుడు వారివారి భార్యల మాటలను 'స్త్రీ బుద్ధియనక' మన్నించి వినటంవల్ల స్త్రీల ఆలోచనలు ఫలవంతమయ్యాయి. కాని ఇక్కడ రాజశేఖరుడు అతని భార్య మాటలను వినికూడ పట్టించుకోకపోవటంవల్ల ఆమె తెలివితేటలు వ్యర్థమై వెలుగులోకి రాలేకపోయాయి. పితృస్వామ్యవ్యవస్థలో స్త్రీకి భర్తతోమాట్లాడే చొరవ ఉండదు. దాంపత్య వ్యవస్థలో స్త్రీ పురుషులు జీవితాంతం కలిసి ఉండేవాళ్ళు ఐనా అపరిచితులుగా మిగిలిపోతారు. అయితే పితృస్వామ్య వ్యవస్థ రతివేళమాత్రం భర్తలను రాకొట్టి పిలవవచ్చనే ఒక్క మినహాయింపు స్త్రీలకిచ్చింది. (7-70) పురుషుడి భోగలాలసతకు సంతృప్తినిచ్చే సందర్భంలో మాత్రమే స్త్రీకి ఈమాత్రం స్వేచ్ఛనిచ్చిన పితృస్వామ్య సమాజం పురుష ప్రయోజనాలకు ఎట్లా ప్రాధాన్యత ఇస్తుందో స్పష్టమవుతుంది.

పితృస్వామ్య సమాజంలో భార్యాభర్తల సంబంధాలు సారంలో బానిస యజమాని సంబంధాలే ఐనప్పటికి వ్యక్తిగత ఆస్తివల్ల హెచ్చుతగ్గులు ఏర్పడుతూ వర్గ వైరుధ్యాలు బలపడే సమాజ పరిస్థితులలో ఆస్తి పరవర్గాలవారి కుటుంబాలలో స్త్రీ పురుషుల మధ్య ఉన్నంతగా అసమానతలు, ఆస్తిలేని వర్గాల కుటుంబాల మధ్య ఉండటానికి అవకాశంలేదు. స్వంత ఆస్తి హక్కు వల్లనే పురుషుడు స్త్రీకంటె

అధికుడౌతున్నాడు. అందువల్ల వ్యక్తిగత ఆస్తిలేని పురుషుడు స్త్రీకంటె పెద్ద అధి
కుడు కాడు. ఆస్తిలేని పురుషుడి పెత్తనానికి తగినంత బలం ఉండదు[28]. పితృ
స్వామిక సమాజంలోని ఈ వైరుధ్యాన్ని ప్రతిఫలించే కథ ప్రథమాశ్వాసంలో
ఒకటుంది. పేదరికంలో బాధపడుతున్న ఒక బ్రాహ్మణుడు వరఫలితంగా అమరత్వ
మిచ్చే పండును పొంది ఇంటికి వచ్చేసరికి దారిద్ర దుఃఖపీడిత యగు అతని భార్య
అతను చేసుకొచ్చిన పనికి ఛాందసుడని నిందిస్తుంది. ఆ పండును ఎవరికైనా ఇచ్చి
ధనాన్ని తెచ్చి కుటుంబ పోషణ కుపయోగకరమైన పని చేయమని చెప్పింది.
ఇక్కడ బ్రాహ్మణుడికి వ్యక్తిగత ఆస్తి లేకపోవటం- అతని భార్యకు పితృస్వామ్యం
స్త్రీకి నిర్దేశించిన వినయ లక్షణాన్ని కాస్తంత వదలుకొని అతనితో హృదయంవిప్పి
మాట్లాడటానికి, అతని చర్యలపట్ల తన స్పందనను వ్యక్తం చేయటానికి, సలహా
యివ్వటానికి అవకాశ మిచ్చింది.

దంపతీ వివాహంలో స్త్రీ పురుషుడి దాసిగా, సొంతసొత్తుగా అయిపోయింది.
తన సంపదమీద హక్కు తనకేఉండాలని, తనే దాసిని సంపూర్ణంగా అనుభవించు
కోవాలనే భావనను పురుషుడికి కల్గించిన వర్గసమాజం, పురుషుడ్ని కుటుంబంలో
తనస్త్రీని తానే అనుభవించటానికి, అదుపుచేయటానికి అన్ని హక్కులను ఇచ్చింది.
ఆ హక్కులను ఆచరణలో అమలుపెట్టుకోవటానికి అవరోధంగా ఉండే భౌతిక
పరిస్థితులను అధిగమింపచేయటం సాంస్కృతిక భావజాల పరంగా తప్ప. సాధ్యం
కాదని గ్రహించిన క్రమంలో 'స్త్రీకి పాతివ్రత్యం' పరమధర్మంగా నిర్దేశించింది-
పితృస్వామిక సమాజం.

విక్రమార్కుడు తన సాహసచర్యలలో భాగంగా 'దానవుచేత కళాహీనిని
పొందుతున్న కాంతిమతిని రక్షిస్తాడు. కాంతిమతిని ఆ దుర్దశసంభవించటానికి కారణ
మేమని విక్రమార్కుడు అడిగినప్పుడు ఆమె తాను 'ధర్మశర్మ' అనే బ్రాహ్మడి
భార్యనని 'అకార్యముగావించి కులము చెఱిచి' (5-317)న ఫలితంగా తాను భర్త శాప
కారణంగా రాక్షసుడిబారిన పడ్డానని చెప్పుకుంటుంది. ఇక్కడ కాంతిమతి కుటుంబ
స్త్రీయైఉండి వ్యభిచరించింది. దంపతీ వివాహసంబంధాలలో స్త్రీ భర్తకు బద్ధురాలై
ఉండాల్సిరాగా ఆమె అతిక్రమించి ప్రవర్తించటం వల్ల కులాన్ని చెరచటానికి
కారకురాలైంది. కనుక అది పితృస్వామిక సామాజిక ఆస్తిత్వానికొక పెద్ద దెబ్బ.
ఇట్లా పితృసామ్య సమాజ ధర్మానికి ఆటంకంగా తయారైన స్త్రీని చంపేహక్కు
భర్తకుందిగాని స్త్రీని చంపకూడదనే ఉదారస్వభావంతో ఆమెను దాక్షిణ్యంతో ఈ
మాత్రపు శిక్షతో వదిలేశాడు. పాతివ్రత్యాన్ని అతిక్రమిస్తే స్త్రీ ఎంతటి శిక్షకు

గుణికావాల్సి వస్తుందో పితృస్వామ్య సమాజం స్త్రీలకు చేస్తున్న హెచ్చరికగా సింహాసన ద్వాత్రింశికలో ఈ కథ చోటుచేసుకుంది. ఒక పురుషుడికి ఒక స్త్రీ, ఒకస్త్రీకి ఒక పురుషుడు అని నిర్దేశితమైన దంపతీ వ్యవస్థలో స్త్రీకి పాతివ్రత్యాన్ని ప్రబోధించే వ్యవస్థలో కాంతిమతిలాంటి ఒక కుటుంబ స్త్రీ ఈ విధంగా వ్యభిచ రించటానికి కారణమేమిటో కాస్త లోతుగా విచారిస్తే, అందుకు మూలాలు పితృ స్వామిక సామాజిక వ్యవస్థ సృష్టించిన నైతిక వైరుధ్యాలలో కనబడతాయి. స్త్రీ పురుష సంబంధాలలో అంతకు ముందున్న వ్యవస్థలలోని స్వేచ్ఛను పురుషుడి పరంగా కొనసాగిస్తూ స్త్రీ వైపునుండి మాత్రం పాతివ్రత్యాన్ని కట్టుదిట్టంగా అమలు చేయటానికి పనిచేసిన దంపతీ వ్యవస్థలో పుట్టినవి ఈ నైతిక వైరుధ్యాలు. దంపతీ వివాహ వ్యవస్థ కుటుంబ వ్యవస్థను పటిష్టంగా నిర్మించినప్పటికీ, పురుషుడి భోగ లాలసత కారణంగా ఆ కుటుంబ పరిధిలోనే స్త్రీల పాతివ్రత్యానికి భంగకరమైన పరిస్థితులేర్పడుతాయి[29]. అందువల్లనే కుటుంబంలోనే ఉన్న కాంతిమతి వ్యభిచ రించిందంటే కాంతిమతిని అందుకు ప్రేరేపించిన పురుషుడి విషయం ఏమిటన్న ప్రశ్న రాక తప్పదు. కాని పితృస్వామ్య సమాజపు భావజాలాన్ని వంట పట్టించు కున్న కవి ఆమెను వ్యభిచారంలోకి దింపిన పురుషుడి గురించి కాంతిమతి భర్త పట్టించుకున్నట్లు చిత్రించలేక పోయాడు. నిజానికి పురుషులు తమ భోగలాల సతకారణంగా పితృస్వామ్య సమాజం నిర్దేశించిన పద్ధతిలోనే కుటుంబంలో తండ్రి చాటుపిల్లలుగానో, భర్తచాటు భార్యలగానో ఉన్న స్త్రీలను లొంగితీసుకునేందుకు రకరకాల మార్గాలలో ప్రయత్నాలు చేస్తారు. ఆ ప్రయత్నాల ఫలితంగానే కుటుంబంలోనే స్త్రీలు వ్యభిచారిణులౌతారు. ముప్పది ఒకటవ బొమ్మ చెప్పిన వజ్రముకుటుని కథలో వజ్రముకుటుడు దాదులద్వారా అంతఃపురంలోకి రాయ బారం జరిపించి పద్మావతిని పొందటం ఇటువంటిదే.

అనంగసేన అంతఃపురంలో ఉంటూనే మందడిడితో సంబంధాలేర్పరచు కున్న విషయంలో భర్త అయిన భర్తృహరి అనంగసేన పట్ల విముఖుడై స్త్రీ జాతి పట్లనే ద్వేషాన్ని పెంచుకోవటాన్ని పితృస్వామ్యవ్యవస్థ సమర్థించింది. అంతః పురంలో ఉన్న అనంగసేన జారిణి కాగలిగిందంటే, అది మూడువందల మంది భార్యలతో సంబంధంలో సున్న భర్త యొక్క చర్యకు ప్రతిచర్య కావచ్చు. కుటుంబ పరిధిలోనే ఉన్న స్త్రీలు వ్యభిచారులుగా తయారైనా, జారిణులుగా తయారైనా దానికి పూర్తి బాధ్యత పురుషుడి భోగలాలసత. దాని ఫలితమైన బహుభార్యాత్వ వ్యవస్థ. మూడువందల మంది భార్యలు కల భర్తృహరి దంపతీ

వ్యవస్థలోని ఒక పురుషుడికొక స్త్రీ అన్న దాంపత్య ధర్మ మూలసూత్రాన్ని ఎంత వరకూ పాటించాదన్నది మౌలికమైన ప్రశ్న. ఒకస్త్రీతో జీవితాంతం నిబద్ధుడై ఉండలేని పురుషుని భోగలాలస దృష్టికి ఫలితమైన బహుభార్యత్వ వ్యవస్థయే, చివరకు కుటుంబ వ్యవస్థలో ఖచ్చితమైన వారసత్వనిరూపణకు నిర్దేశించిన పాతి వ్రత్య సూత్రానికి ఆటంకమై కూర్చుంది.

## 2.2.4. సహగమనం :-

జీవితానికి మరణం ముగింపు. పుట్టిన ప్రతి మనిషి గిట్టక తప్పదనేది ప్రాకృతిక సత్యం. ఐతే స్త్రీకి సమగ్ర జీవితాన్ని ఇవ్వలేని పితృస్వామ్య సమాజము ఆమెకు సహజమరణాన్ని కూడ ఇవ్వలేదు. భర్తకు బానిసగా నోరు విప్పి ఎదురుచెప్పలేని స్థితిలో, పాతివ్రత్య నియమాలమధ్య అసమానమైన, అవమానకరమైన పరిస్థితులలో నిత్యం చస్తూ బ్రతికే స్త్రీకి 'సతిలో' సమాధిని కట్టింది పితృస్వామిక సామాజిక వ్యవస్థ. పురుషునికి పరలోక అవసరాలు తీర్చడానికి స్త్రీకి సహగమనం నిర్దేశించింది వ్యవస్థ. కుటుంబవ్యవస్థలో భర్తకు భార్య శరీరం మీద నున్న హక్కును, అతని మరణం తరువాత కూడ అమలు పరుచుకోవటానికి వీలయినంత బలమైందిగా నిలబెట్టింది పితృస్వామ్య సమాజం. అందువల్లనే మరణించిన పతితోపాటు చితినెక్కి మరణించే స్త్రీ అతనితోసహా స్వర్గానికి వెళ్ళి సుఖిస్తుందని ప్రచారం చేసింది (11-153)[30]. సింహాసనద్వాత్రింశికలో ఈ విధమైన ప్రచారానికి రెండు కథలు వున్నాయి. గోపరాజు ఇందుకోసం ప్రత్యేకించి ఒక గారడి విద్యా ప్రదర్శన సందర్భాన్ని సమర్థవంతంగా వాడుకున్నాడు.[31] విక్రమార్కుడు వసంతోత్సవాల అనంతరం కళాప్రదర్శనను వీక్షించుచున్న సందర్భంలో ఒక వైతాళికుడు వచ్చి తానొక 'విద్యను మెప్పయించెద'నని (11-131) చెప్పి గారడి విద్యా ప్రదర్శనకు పూనుకున్నాడు. అందులో భాగంగా 'సతి' నిర్వర్తించటం ప్రదర్శింపబడింది. యుద్ధానికి పోబోతూన్నో వీరుడు తన భార్యను తెచ్చి రాజు ప్రాపకంలో ఉంచి వెళ్ళినట్లూ యుద్ధంలో అతను మరణించగా ఆమె సతికి పూనుకొని అందుకు రాజుఅనుమతిని వేడటం, రాజందుకు అభ్యంతరం చెబితే వితంతువుగా 'దుర్భరమైన జీవితం గడపటం కన్నా సతి చేయుటం మేలని, పతివ్రతయైన స్త్రీ భర్తను అనుసరిస్తుందని, చెప్పి, రాజునందుకు ఒప్పించటం, సతిచేయుటం ఇందులో ప్రదర్శింపబడ్డాయి. అద్భుతవిషయాలతో ఆశ్చర్యాన్ని కల్గిస్తూ తద్వారా వినోదాన్ని కల్గించే కళ గారడీవిద్య. ఐతే ఈ కథలో ఇంద్రలోకంలో జరిగిన యుద్ధంలో మరణించిన వీరుని తెగిన అంగాంగములు సభలో

పైనుండి క్రింద పడటం అద్భుతమైన విషయం. అది తప్ప ఆ ప్రదర్శన చూపించిన మిగిలిన సన్నివేశాలలో ముఖ్యంగా సతీ సహగమనం ఒక సామాజిక వాస్తవం. స్త్రీల బ్రతుకులకు చిచ్చుపెట్టేటువంటి సతిలాంటి దురాచారాన్ని వినోదాత్మకంగా ప్రదర్శించటం గమనించదగింది. స్త్రీల జీవితాలకు హానికరమైంది. పితృస్వామిక సమాజానికి ఎంత వినోదంగా ఉందో దీనిని బట్టి అర్థం చేసుకోవచ్చు.

ఈ కథలో సతికి సిద్ధపడిన ఆమె, రాజు అనుమతిని కోరుతుంది. కథలో భర్త తనను అతని సంరక్షణలో ఉంచిపోయాడు కనుక సహగమనం చేయటానికి అతని అనుమతిని కోరటం సహజంగా జరిగిందనుకోవచ్చు. కాని ఇదే మధ్య యుగాలనాటికి, ప్రధానంగా ముస్లింరాజుల పాలనలో చారిత్రక వాస్తవానికి ఒక రూప కల్పనగా కనబడుతుంది. 'సతిదురాచారం'లో ఉన్న అమానుషత్వాన్ని గుర్తించిన అక్బరు సతి చేయకాల్చుకున్న వారు ప్రభుత్వ అనుమతి తీసుకోవాలని పేర్కొన్నాడు. ఉత్తరదేశంలోనున్న ఈ పాలనాసూత్రం క్రమంగా దక్షిణ దేశాల రాజ్య వ్యవస్థలకు కూడ ఆమోదయోగ్యమై ఉండొచ్చు. మధ్య యుగాలనాటి కవిగా కొరవి గోపరాజు తన సమకాలీన పాలనా విధానాన్ని సందర్భానుసారంగంగా కథేతి వృత్తంలోకి ప్రవేశపెట్టి ఉంటాడు. సతికి సిద్ధపడిన స్త్రీ రాజు అనుమతి కోరితే రాజు అందుకు ఒప్పుకోకుండా 'జనకుని వలె' తాను పోషిస్తానని మాట ఇవ్వటం అందుకు ప్రతిగా సతికి సిద్ధమైన స్త్రీని చితిమీదకు పంపించటం తండ్రియైనవాడుగా చేయవలసిన పని అని ఆమె చెప్పటం జరిగింది. (11-146)[32] సతిని ఏర్పాటు చేయటం తండ్రియొక్క విధులలో ఒకటిగా పితృస్వామ్య సమాజంలో ముందుకొచ్చింది. కనుకనే ప్రజలకు తండ్రిలాంటి వాడైన రాజు అనుమతి ఇవ్వటానికి సందేహించినప్పుడు ఆమె అతనికి తండ్రి విధిని గుర్తు చేసి హెచ్చరించింది.

సతి చేసేందుకు ఇంతగా తహతహలాడటానికి, సతి చేయకపోవటం వల్ల వితంతువుగా గడపాల్సిన హీన దశను తలచుకొని భయపడటమూ, 'ఇంతితోడ జచ్చి పతి అధోగతుడైన తానుద్ధరించి సౌఖ్యమొదవుచుండు' (11-50) అనే భావనతో సతిని పాటించి పతివ్రతా ధర్మానికి వన్నె పెట్టుకోవాలని ఉబలాటపడటము కారణాలు.

వితంతువైన స్త్రీ పువ్వులకు, అలంకారాలకు దూరం చేయబడి అశుభాకృతితో పెళ్ళి పేరంటాలకు వెలిగా బ్రతకాల్సి వస్తుంది (11-147), చచ్చి చావని

బ్రతుకు బ్రతుకుతూ నియమ నిబంధనల మధ్య తిండికి కూడ మాడుతూ కాలం గడపాల్సి వస్తుంది. పురుషుడి సంతానానికి స్త్రీని బాధ్యురాలినిగా చేసిన పితృస్వామ్య సమాజ స్వభావం స్త్రీని ఈ దుస్థితికి తీసుకొని వచ్చింది. భర్త మరణించిన స్త్రీని నియమ నిష్ఠలకు గురిచేసి, నల్గురిలోకి తలెత్తుకు రావటానికి వీలులేని పద్ధతిలో విరూపురాలిని చేయటంచేతనే స్త్రీయెడ పురుష ప్రపంచంలో కోరిక కలగకుండా జాగ్రత్తపడటం సాధ్యమవుతుంది. ఇటువంటి దుర్భర పరిస్థితులలో వితంతువుగా బ్రతుకుట కంటె చచ్చుబకుట మేలని స్త్రీ అనుకోవటంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

పతివ్రతా ధర్మాలను ప్రస్తుతించి పతివ్రతయైన స్త్రీని కీర్తించే పితృస్వామిక సామాజిక సాంస్కృతిక భావజాలం పుట్టినది మొదలు స్త్రీని పితృస్వామ్య వ్యవస్థకు కావల్సిన వ్యక్తిగా తయారుచేస్తుంది. సహగమనం చేసిన స్త్రీ అధోగతుడైన భర్తని ఉద్ధరించి అతనితోపాటు స్వర్గసౌఖ్యాలు అందుకుంటుందని చేస్తున్న ప్రచారాలవల్ల పెంచుకునే భ్రమలు, సహగమనం చేసిన స్త్రీ దైవత్వాన్ని సంతరించుకొంటుందని చెప్పే మాటలు, వీటన్నిటినీ మించి సహగమనంచేసి లోకం మెప్పును పొందాలనే కాంక్ష అన్నీ కలిసి స్త్రీని సహగమనానికి ప్రేరేపిస్తాయి[33]. అందువల్లనే పతి దుఃఖించిన తాను దుఃఖించి, అతడు ఊరికి వెళ్ళినపుడు అతనికోసం కృశించి, మరణిస్తే అతనితోపాటు మరణించే స్త్రీ పతివ్రత అవుతుందని (11-149) చెప్పి తాన్నటువంటి పతివ్రతల కోవలోకి చేరటానికి ఆ స్త్రీ ఉత్సాహపడుతుంది. రాజు నందుకు ఒప్పించటంకోసం అతను సతికి ఒప్పుకోకపోయినట్లయితే తాను ఉరిపెట్టుకొనిగాని, నీళ్లల్లో దూకిగాని, విషం త్రాగిగాని ప్రాణాలు విడవడం తథ్యమని, ఆ పాపపు చావులకు తనను పోనీయకుండా 'పుణ్యమౌ అగ్నిప్రవేశంబు జేయించుమని'(11-153) వేడుకుంటుంది. అంటే సతి ఒకరకంగా ఆత్మహత్య ఐనా దానిని నీచపు మరణంగా కాక వీరమరణంగా, పుణ్యకార్యంగా చిత్రించే ధోరణి ఇక్కడ కన్పడుతుంది. అట్లాగే ప్రథమాశ్వాసంలో విక్రమార్కుడు మరణించాక అతని భార్య సహగమనం చేయటానికి సిద్ధపడ్డప్పుడు గర్భిణి కనుక ఆమె చావ తగదని మంత్రులు సలహా ఇస్తారు. పిల్లలుండి, భర్త వంశాన్ని నిలబెట్టుతున్న స్త్రీ, ఆ పిల్లలను పెంచి పెద్దవాళ్ళను చేయటంకోసం సతినుండి మినహాయింపబడుతుంది. అందుకనే విక్రమార్కుని మంత్రులు అతని భార్యను సహగమనం చేయద్దంటారు.

కాని ఆ మినహాయింపునుకూడా ఒప్పుకోకుండా సహగమన సూత్రాన్ని ఖచ్చితంగా పాటించే వీరపత్నిగా ఆమె 'పొట్టవచ్చి శిశువునకు పుచ్చి యిచ్చి' (1-166) మరీ అగ్నిప్రవేశం చేస్తుంది.

ఏమాత్రం అధైర్యపడకుండా ఏదశలోను వెనుకడుగు వేయకుండా స్త్రీ 'సతిని' ధైర్యంతో నిర్వర్తించమని చెప్పటం కోసం జీమూత వాహనుని కథలో మలయవతి 'కన్య ధైర్యంబవలించి (5-248), గారడి విద్య ప్రదర్శనలోని స్త్రీ 'ధృతిమతిబొంగి' (11-154) సహగమనాలు చేశారని ప్రత్యేకించి నొక్కి చెప్పటం జరిగింది.

## 2.3. మహిళా జనజీవనం—కుటుంబం బయట :

దంపతీ వ్యవస్థకు అనుబంధంగా వచ్చిన వ్యభిచారానికి ఫలితంగా ఏర్పడిన సమాజంలో కుటుంబేతర స్త్రీలున్నారు. మధ్యయుగాలనాటి సామాజిక సంస్కృతీ సంబంధాలలో చోటుచేసుకున్న పురుషుని భోగలాలసతకై రూపొందింపబడినదే వేశ్యా వ్యవస్థ. ఈ వేశ్యలందరూ కుటుంబం బయట, పురుషులతో కుటుంబేతర సంబంధాలలో వుంటారు.

పితృస్వామ్య సమాజం కుటుంబీకులకంటె, కుటుంబంబయట 'రూపాజీవను' లుగా వున్న స్త్రీలకు ప్రత్యేక స్థానాన్ని ఇచ్చింది. పురుషుడి భోగానికి ఉపయోగపడ తారు గనుక వారి పుట్టుటకు కొంత విలువనుకూడ కల్గించింది.

రూపాజీవనులైన ఈ స్త్రీలకు వారి జీవన వృత్తికి అనుకూలంగా శారీరక సౌందర్య ప్రదర్శనకు పురుషులను ఆకర్షించేందుకు ఉపయోగపడే విధంగా సంగీత, నృత్యగాన విద్యలను నేర్పినట్లు కనపడుతుందిగాని, వారికి కూడా సామాజిక పరి జ్ఞానం కల విద్యావకాశాలు లేకుండా చేసింది. కుటుంబంలో స్త్రీలు భర్తల సొమ్ము కాగా ఈ స్త్రీలు సమాజంలో పురుషులందరి సొమ్ము. ముఖ్యంగా రాజ్య సంపదగా రాజకీయ వ్యవహారాలలో మారకానికి కూడ పనికివచ్చే స్థితిలో ఈ స్త్రీలు కనబడ తారు.

సాక్షాత్తు విష్ణువే అల్లుడైనాడని బృహత్సేనుడిపట్ల భయంతో అతనినుండి తమ రాజ్యానికి ఏ ఇబ్బంది రాకుండా ఉండటంకోసం తక్కిన రాజులు కుంజరము లతోపాటు కన్యలను కప్పముగ (2-131) ఇచ్చి పంపారు. అట్లాగే పాండ్య రాజ మంత్రులు విక్రమార్కునికి తెచ్చిచ్చిన సామంత కప్పాలలో భాగంగా 'నూర్వురు వారసతులు' (11-172) ఉన్నట్లు కనబడుతుంది. ఈవిధంగా 'ముత్యాలకాపవర్ను,

దీనారాలు, ఏనుగులు, గుర్రాలు వీటితోపాటు కానుకలుగా ఇవ్వదగిన వస్తుసంపదలో వారకాంతలను కూడ చేర్చింది పితృస్వామ్య సమాజం. వస్తుసంపదలో భాగంగా కప్పాలుగా చెల్లించబడే ఈ స్త్రీలు మళ్ళీ వారిపై హక్కుదారులైన వారిష్ట ప్రకారం చేతులు మారుతూ కూడా ఉంటారు. పాండ్యరాజ మంత్రులనుంచి కప్పంగా పొందిన 'నూర్వుర వారసతుల'లో 'నవాంగన'లను (11-173) విక్రమార్కుడు గారడీ విద్యాప్రదర్శకునికి ఇవ్వటంలో స్పష్టమవుతుంది.

కుటుంబ పరిధిలో లేని ఈ వారసతులకు కూడ తమ శరీరాలమీద, తమ బ్రతుకులమీద తమకు హక్కు లేకపోవటం ఇక్కడ గమనించవచ్చు. అంటే ఈ స్త్రీల మనుగడ వాళ్ల యిష్టాలకు తగినట్లుకాక పితృస్వామ్య సామాజిక వ్యవస్థా ప్రయోజనాలకు అనుగుణంగా సాగుతున్నదని అర్థం చేసుకోవచ్చు.

### 2.3.1 వేశ్యావ్యవస్థ :

పురుషుడి సొంత ఆస్తికి వారసులుగా సంతానంమీద పురుషుడికి హక్కునిచ్చే పితృస్వామిక కుటుంబవ్యవస్థ ఏర్పడుతున్నప్పుడే, దానికి సమాంతరంగా అంతకు ముందున్న స్త్రీ పురుష సంబంధాలవ్యవస్థలో పురుషులకున్న స్వేచ్ఛను ఆచరణలో నిలుపుకుంటున్న దానికి చిహ్నంగా కుటుంబంబయట వేశ్యావ్యవస్థ రూపుదిద్దుకుంది.

వ్యవసాయం బాగా అభివృద్ధి చెంది పట్టణాలు ఏర్పడేకొద్ది పురుషుల భోగ లాలసతకు నిలయంగా వేశ్యావాటికలు ప్రతి పట్టణంలోనూ తయారయ్యాయి. కనుకనే పన్నెండవ బొమ్మ చెప్పిన కథలో దేశాంతరయానం చేసిన భద్రసేనుడు పోయినంతదూరం ఒక్కొక్క ఊరిలో 'చక్కని కాంతలనతి రసజ్ఞులను' చూచాడని కొరవి గోపరాజు వర్ణించాడు. అటువంటి వేశ్యావాటికలకు ప్రతీకగా కొరవి గోపరాజు కాంచీ పట్టణమునందలి ఒక వేశ్యావాటికను కావ్యంలో చిత్రించాడు. నగర పురుషులు ఈ వేశ్యావాటికలకు తమ యిష్టం వచ్చినప్పుడు వస్తూ, వేశ్యల రూపాన్ని, వయస్సుని ధనం పారేసి కొని అనుభవిస్తారు. అందుకు ప్రతిఫలంగా వేశ్యలు ప్రేమను అభినయిస్తారు. స్వచ్ఛంగా పుట్టి వికసించాల్సిన స్త్రీ పురుషుల ప్రేమను అభినయంగా తేల్చి, అమ్మడానికి కొనుక్కోవటానికి వీలయిన సరుకుగా చేసిన పితృస్వామ్య సమాజం యొక్క దుష్టత్వం వేశ్యావాటికలో కన్పడుతుంది. తబ్బిబ్బి వేశ్యల దగ్గర సుఖం కొనుక్కోవడానికి వచ్చే విటులు వేశ్యలకు ధనంమీద ఆశ ఉందని తెగ బాధపడుతుంటారు. ఈ సందర్భంలో వేశ్యావాటికల్లో ఎక్కువగా నిందకు గురి అయ్యేది వేశ్యామాత. విటుల స్వేచ్ఛావిహారానికి వేశ్యామాత తెలా

అటంకంగా ఉన్నారో గోపరాజు విటుల సంభాషణా రూపంలో వ్యాఖ్యానంచేస్తాడు. వేశ్యామాతను 'ధనము పయిగాచియున్న దయ్యము' (4-243) అని, 'సహకార ఫలము పొంతనున్న కడుందురు' అని (4-245)' 'నిర్మల మడుగులోని మకరము' (4-247) అని 'నరమోహిని నంటియున్న నరభోజి' అని రకరకాలుగా దూషించారు. ఈ దూషణలన్నింటికీ ధనము వసూలు విషయంలో వేశ్యామాత విటుల దగ్గర ఖచ్చితంగా ఉండటమే కారణం. మరేరకమైన జీవనవ్యావృత్తి లేని వేశ్య, కొద్ది కాలంలో నశించిపోగల రూపయవ్వనాలను నమ్ముకొని బ్రతుకుతున్న వేశ్య ఆ తరువాత జీవితంలో తన బ్రతుకుతెరవుకై కావలసిన ధనాన్ని ఇప్పుడే సంపాదించి పెట్టుకోవాలి కనుక వేశ్యమాత అంత ఖచ్చితంగా ఉండక తప్పదు. వేశ్యబ్రతుకుకు ధనాన్ని మించిన రక్షణ లేదు కనుక ఆ ధనాన్ని ఆమె ప్రేమించటం సహజం. తన బ్రతుకుకు కావల్సిన అత్యవసర రక్షణ కవచంగా నున్న 'ధనం'పట్ల నిర్మోహమోటాన్ని, విటులపట్ల కాఠిన్యాన్ని అలవర్చుకొన్న వేశ్యామాతను గురించి 'ఆ కూతురు పుట్టగానే వేశ్యామాత ఆయువును లోకేశుడ వెడగె హరింపలేదే' (4-225) అని అనుకొంటారు ఆ విటులు. వేశ్యలు కావాలిగాని, వేశ్యల కన్నతల్లిని గురించి మాత్రం అంత అమానుషంగా మాట్లాడుకోవడం పితృస్వామ్య సమాజంలో పురుషులు అలవరచుకొన్న పచ్చి స్వార్థాన్ని నగ్నంగా చూపిస్తుంది.

విటలోక వంచని కథలో ముగ్గురు పురుషులు ఒక వేశ్య కోసం ఒకేసారి రావటం కనబడుతుంది. ఆమె ఆ ముగ్గురిలో ఎవరినీ నొప్పించకుండా, నిర్లక్ష్యం చేయకుండా ప్రవర్తించి పితృస్వామ్య సమాజం తనపై పెట్టిన పురుషుడి భోగలాలసతను సంతృప్తి పరచటం అనే బాధ్యతను జాణతనంతో నిర్వర్తించటం అయినట్లయింది. ఒక వేశ్యకోసం ముగ్గురు విటులు పోటీపడటం నానాటికి దంపతీ వివాహ వ్యవస్థలో పెచ్చరిల్లుతున్న పురుషుని భోగలాలసతకు నిదర్శనంగా వుంది.

సింహాసన ద్వాత్రింశికలోని వసంతోత్సవాలు నాటి పితృస్వామిక సామాజిక భోగలాలసతకు ప్రతీకలు. ఆరవ బొమ్మ చెప్పిన కథలో వసంతోత్సవాల సందర్భంలో 'అంగసంగ సుఖమందిరి కొందరు ప్రేమ కాముకుల్' (3-166) అని చెప్పటం, పదహారవ బొమ్మ చెప్పిన కథలో వసంతోత్సవాలలో 'ఇంతులకి మాన భంగము... జాణలకు భోగభాగ్యము (7-7) సంభవిస్తాయని వర్ణించటం నాటి పితృస్వామ్య వ్యవస్థలో విశ్రాంతి వర్గాలవారి భోగ జీవితాలకు అద్దం పట్టింది.

## 11. మహిళా జన జీవన అధ్యయనం - సామాజిక చారిత్రక నేపథ్యం - వివరణలు.


1) మార్క్స్ ఏంగిల్స్ సంకలిత రచనలు 111-ప్రగతి ప్రచురణాలయం - 1982-పుట : 166.

2) 'ఈ రకమైన స్త్రీ పురుష సంబంధ వ్యవస్థను ప్రత్యేకంగా పేర్కొనక పోయినా రక్తసంబంధీకుల కుటుంబం సూచిస్తున్న సమాజాన్ని ఆధారంగా చేసుకొని అంతకు పూర్వమున్న అనియత స్త్రీ పురుష సంబంధాలు కల సమాజ స్థితిని ఊహించుకోవచ్చు' - లూయిమోర్గన్ - పురాతన సమాజం- విజ్ఞాన వికాస సమితి ప్రచురణ (అనువాదం-మహీధర రామమోహన్‌రావు) - పుట : 382.

3) పైదే పుట : 352.

4) మార్క్స్ ఏంగిల్స్ సంకలిత రచనలు 111-పుట : 170

5) పైదే పుట : 148

6) గార్డెన్ ైబల్ట్-చరిత్రలో ఏం జరిగింది. 'అనువాదం— వల్లంపాటి వెంకట సుబ్బయ్య, హైద్రాబాద్ బుక్‌ట్రస్టు-జనవరి 1985 - పుట : 27, 32, 34

7) 'మంచి బలమైన శారీరక మానసిక లక్షణాలు కల రెండు తెగలు అనాగరికపు జీవితపు యాదృచ్ఛిక సందర్భాలలో ఒకచోట కలిసి ఒక ప్రజగా ఏర్పడటం వల్ల మెదడు పెరుగుతుంది. ఇద్దరి యొక్క సమ్మేళన శక్తిలో క్రొత్త సంతానం ఏర్పడతారు. ఈ తరం అదివరకటి రెండు తెగలమీద మెరుగు' లూయి మోర్గన్-పురాతన సమాజం- పుట : 419.

8) మోర్గన్-పురాతన సమాజం-పుట : 391

9) మార్క్స్ ఏంగిల్స్ సంకలిత రచనలు 111- పుట : 185

10) ఏంగిల్స్-కుటుంబం వ్యక్తిగత ఆస్తి రాజ్యాంగాల పుట్టుక. మార్క్సిస్టు ప్రచురణలు-ఆగస్టు 1973-పుట : 32.

11) మార్క్స్, ఏంగిల్స్ సంకలిత రచనలు 111 - ప్రగతి ప్రచురణాలయం- పుట : 178

12) లూయీ మోర్గన్-పురాతన సమాజం- పుట : 317

13) లూయీ మోర్గన్-పురాతన సమాజం- పుట : 556

14) పైదే పుట : 357

15) పైదే పుట : 416

16) ఆస్తి ఎక్కువగా ఏర్పడటం దానిని కొడుకుల కివ్వాలనే కోరికతో గణంలో స్త్రీ పారంపర్యం స్థానంలో పురుష పారంపర్యం వచ్చింది.
మోర్గన్-పురాతన సమాజం-పుట : 420

17) మార్క్స్ ఏంగిల్ సంకలిత రచనలు 111-పుట : 198

18) మార్క్స్ ఏంగిల్స్ సంకలిత రచనలు 111-పుట : 203

## వివరణలు 11 - (2) కావ్యము - మహిళాజన జీవనం

19) కాత్యాయని విద్మహే - తెలుగు సాహిత్యంలో స్త్రీ పాత్ర చిత్రణ-ప్రసారిత జనవరి-జూన్ 1984. పుట : 50

20) జె. వరలక్ష్మి - యుగయుగాల్లో మహిళ - నాట్యకళా ప్రెస్ హైదరాబాద్ - 1977-పుట : 88

21) 'పున్నామ్నో నరకాత్త్రియత ఇతిపుత్ర' అను వేదవచనంబు కలదు గావున 'బుణ్యాచార్యుడైన పుత్రు డుభయపక్షంబు వారి నుద్ధరించు'
నన్నయ్య-ఆంధ్ర మహాభారతం-ఆదిపర్వము-చతుర్థాశ్వాసం వచనము, 88

22) కాత్యాయనీ విద్మహే, జ్యోతిరాణి, శోభ | స్త్రీ విద్యా భావనలు- అధ్యయనం - విజృంభణ జనవరి 1989. పుట : 16

23) ప్రజలు విస్తృతంగా విశ్వసించారంటే అది ఏదో ఒక సామాజిక పరిణామ క్రమాన్ని ప్రతిఫలించి వుండాలి. ఈ ప్రతిఫలనం ఉన్న దున్నట్టుగా కాకపోవచ్చు. దీనిని శాస్త్రీయంగా అధ్యయనంచేసి దాని వెనకున్న పరిణామాలను గుర్తించటం అవసరం. అది చేయడానికి నిరాకరిస్తే ఒక విలువైన చారిత్రక ఆధారాన్ని కోల్పోతాం అని కోశాంబి అంటాడు.
డి. డి. కోశాంబి-ప్రాచీన భారతదేశ చరిత్ర-హైదరాబాద్ బుక్ట్రస్ట్ సెప్టెంబరు-1986 పుట 72 అనువాదం కె. బాలగోపాల్.

24) మార్క్స్ ఏంగిల్స్ సంకలిత రచనలు 111-పుట : 180, 181.

25) స్త్రీ పారంపర్యము నుంచి పురుష పారంపర్యానికి మార్పు వచ్చినప్పుడు తల్లి, భార్యల పరిస్థితి నష్టపడ్డాయని పైన చెప్పారు. ఆమె పిల్లర్ని ఆమె స్వంతగణంనుంచి మార్చారు. వివాహంతో గణంలోవున్న ఆమె హక్కులు పోయాయి. దానికి సమానమైన హక్కులు మరేవీ రాలేదు. ఈ మార్పు రాకపూర్వం యింట్లో ఆమె గణంవారికే ప్రాధాన్యత వుండేది. అందుచేత తల్లితో అనుబంధం దృఢంగా ఉండేది. కుటుంబానికి కేంద్రం మగవాడు కాక ఆడదే అయి ఉండేది. ఈ మార్పు వచ్చాక మగని యింట్లో ఆమె వంటరిదైపోయింది. గణ బంధువుల తోడులేదు. అందుచేత తల్లి అను బంధం, బలం క్షీణించింది. ఆమె స్థితిని హీన పరిచింది. సమాజంయొక్క స్థాయిలో ఆమె పురోగతిని ఆటంకపరిచింది.

మోర్గన్-పురాతన సమాజం-పుట : 422, 423.

26) మార్క్స్ ఏంగిల్స్ సంకలిత రచనలు 111-పుట : 201, 202

27) పైదే పుట : 203

28) పైదే పుట : 204

29) 'స్వీయ' అంటే భార్యకు 'బుజుశీలం' ఉండాలని చెప్పిన అలంకార శాస్త్రంలోనే స్త్రీ శీలం పోయేటట్లు చేయటంలో ప్రాధాన్యం వహించే శక్తులు ఎన్ని సమాజంలో సర్వత్రా వ్యాపించి ఉన్నాయో కనబడుతుంది. స్త్రీలను వ్యభిచారానికి ప్రోత్సాహించటంలో తోడ్పడే దూతికల గురించి అలంకార శాస్త్రంలో ఉంది. సఖి, నటి, దాసి, దాది, పొరుగింటావిడ, చిన్న పిల్లలు, యోగినులమని సంసారం వదిలి కూర్చున్నవాళ్ళు, చాకలి మొదలైన వృత్తి పనుల స్త్రీలు, పూలు, తమలపాకులు, సుగంధ ద్రవ్యాలు మొదలయిన భోగవస్తు వ్యాపారంచేసే స్త్రీలు, వంటకత్తెలు, గాయక స్త్రీలు - ఇంతమంది దూతికలున్నారు. స్త్రీలని వ్యభిచారంలోకి దించేపని చేసినందుకు అధికార పురుష వ్యవస్థ కానుకలిచ్చి వాళ్ళను మన్నిస్తుంది - కాత్యాయని విద్మహే, అలంకార శాస్త్రంలో స్త్రీ, తెలుగు-వైజ్ఞానిక మాసపత్రిక-అక్టోబరు 1987-పుట : 16

30) "అటుగాక పుణ్యమా నగ్ని ప్రవేశంబు
చేయింపు మాకిడు చెందదిండు
నెన్న ముక్కోటియు నేబది లక్షలు
మానవు మేన రోమంబులుండు
నన్ని యేడులు స్వర్గమాత్మ నాయకుతోడ
ననుగతయౌసతి యనుభవించు
పీరునియాలనై విధవనై యుండుట
సముచితంబదిగాదు చాగనిమ్ము

ఆ. వె. తడమనేలయనుచు ద్రరుణి ప్రార్థించిన
మాలు పలుక లేక మనుజవిభుండు
కొంత యనుమతింప నంతలో దజను,
లాయితంబు చేసి రాస్తులగుచు..."

కొరవి గోపరాజు - సింహాసన ద్వాత్రింశిక-తెలుగు అకాడమీ
హైదరాబాద్ 1982 11వ ఆశ్వాసము. 153 పద్యము.

31) సురవరం ప్రతాపరెడ్డిగారు-ఆంధ్రుల సాంఘిక చరిత్ర-పుట : 168

32) "ఇది చాగెడు కొఱకైనీ
పదముల కడనుంచె నిట్లు పతిపోయిన స
త్పదమున కేగెదననుపుట
మది జూడగ నిదియె తండ్రి మన్న నగాదే"

కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక - తెలుగు అకాడమి
హైదరాబాద్ అక్టోబరు 1982-11వ ఆశ్వాసం-146 పద్యము.

33) కాత్యాయని విద్మహే జ్యోతిరాణి, సతీసహగమనం - కొన్నిద ృక్కోణాలు
- కదలిక నవంబరు జనవరి 1987, 88-పుట : 33

# 3. స్త్రీ పాత్రల స్వభావ చిత్రణ

## 3. 1. పాత్రలు-స్వభావాలు :

పుట్టుకనుండి మరణం పర్యంతం వ్యాపించి ఉండే మానవజీవితం మొత్తం సామాజిక సంబంధాల వల్ల పరిణమిస్తుంది. వ్యక్తుల సమూహాలు పరస్పరం ఆశించే ప్రవర్తనుబట్టి సామాజిక సంబంధాలు నిర్ణయింపబడతాయి. సామాజిక సంబంధాల తీరు తెన్నులు ఆయా సమాజాల సంస్కృతిలోని విలువలననుసరించి మారుతూ ఉంటాయి. మనిషి సమాజంలో భాగంగా భావాలను ఏర్పరచుకుంటూ ఆలోచనలను పెంచుకుంటూ అభివృద్ధి చెందుతుంటాడు. భౌతిక ప్రపంచాన్ని నిత్యమూ అనుశీలించే మానవులు తమ తమ వ్యక్తి చైతన్య స్థాయిలనుబట్టి ఏర్పరచు కొన్న భావాలే వ్యక్తి స్వభావాన్ని నిర్దేశిస్తాయి. ఈ విధమైన వ్యక్తి స్వభావం మనిషియొక్క అంతర్గత విశ్వాసాలనుండి ఉద్భవించినట్లు కనబడవచ్చు. కాని స్వభావము జన్మతః మనిషితో పుట్టి పెరిగేది కాదు. మానవుడు సామాజిక సంబంధాలలోకి ప్రవేశించిన మత సాంస్కృతిక సంప్రదాయాల ఆచారాలు ఆయా నిర్దిష్ట సమాజాల నియమాలను మానవుల సహజ స్వభావంగా కనబడేటట్లు చేస్తాయి[1]. అందువల్ల వ్యక్తి స్వభావ నిర్మాణంలో సాంఘిక కారకాలకున్న ప్రాధాన్యత ప్రముఖంగా పేర్కొన తగినది. సింహాసన ద్వాత్రింశికలోని సమగ్ర మహిళా జనజీవన చిత్రణ వాళ్ళు ఎంత సంశ్లేష్టకౌటుంబిక సామాజిక సంబంధా లలో ఉన్నారో స్పష్టం చేసింది. ఈ సామాజిక సంబంధాలలో భాగస్వాము లైన స్త్రీల బాహ్యప్రవర్తనను, అంతర్గత ఆలోచనా విధానాన్ని పరిశీలించినప్పుడు వ్యక్తులుగా వాళ్ళ ప్రత్యేక స్వభావాన్ని అర్థం చేసుకోవటానికి వీలేర్పడుతుంది. ఈ ప్రాతిపదిక మీద సింహాసన ద్వాత్రింశికలోని మహిళా జన స్వభావాలను విశ్లేషించు కోవాలి.

మహిళా జన స్వభావాలను విశ్లేషించాలంటే ముందుగా సింహాసన ద్వాత్రింశికలో ఎంతమంది మహిళలు ఏయే స్థాయిలలో, పద్ధతులలో కనపడతారో చూడాలి. మానవ జీవితం వ్యక్తుల సంబంధాలమయంగా ఉంటుంది కనుక వ్యక్తులుగా మహిళల ప్రవర్తనా స్వభావాలు పరిశీలించడం వల్ల మానవ జీవితం సమగ్రంగా అర్థం అవుతుంది. స్త్రీ పాత్రల స్వభావాన్ని ప్రత్యేకంగా పరిశీలించటం ద్వారా పాత్రల నిర్మాణానికి మూలంగా పనిచేసిన లౌకిక మహిళా జన జీవనాన్ని గురించి ఆలోచించటానికి వీలు ఏర్పడుతుంది.

కావ్యంలో స్త్రీల పాత్రలు ప్రధానంగా కల్గిన కథలు దాదాపు 20 ఉన్నాయి. మొత్తం ముప్పదిరెండు కథలు వానిలోని 11 అవాంతర కథలలో స్త్రీలు ప్రత్యక్షం గానూ పరోక్షంగానూ పురుషులతో సంబంధాలలోకి రావడం కనబడుతుంది. వీళ్ళల్లో కుటుంబంలోపల వ్యక్తులుగా కొందరు ఉంటే, మరి కొంతమంది కుటుంబేతర సంబం ధాలలో కనబడతారు.

సింహాసన ద్వాత్రింశికలో ప్రత్యక్షపాత్రలుగా వచ్చే స్త్రీలు 35 మంది, ప్రస్తావనావశంగా వచ్చే స్త్రీలు 5 గురు. ఈ ఐదుగురిది కథేతి వృత్తగమనంతో పరోక్షపాత్రలు. ప్రత్యక్ష పాత్రలయిన 35 మంది స్త్రీలలో 9 మంది తమకంటూ ప్రత్యేకమైన పేరు లేకుండా ఉన్నారు. వారు విక్రమార్కుడి అగ్రమహిషి, విన్నయాలి, మగనాలి, రాజశేఖరుని భార్య, బ్రాహ్మడి భార్య, కోడలు ఇత్యా దులుగా పురుషుల సంబంధంలో, ప్రత్యేకంగా ఒక పురుషుడి భార్యగా గుర్తింపబడి చెప్పబడ్డారు. వీళ్ళుగాక మరో ఏడు సందర్భాలలో పురుషుడి భార్యలుగా, భోగ కాంతులుగా కానుకల కింద కప్పాలుగా ఇవ్వబడిన స్త్రీలుగాను సామూ హికంగా ఏ పేరూ ప్రత్యేకమైన వ్యక్తిత్వమూ, గుర్తింపులేకుండా కింద కప్పాలుగా ఇవ్వబడిన స్త్రీలుగాను కన్పడుతూ, సామూహికంగా ఏ పేరూ ప్రత్యేకమైన వ్యక్తిత్వమూ, గుర్తింపు లేకుండా కనపడతారు.

ఈ విధంగా కనబడే స్త్రీ పాత్రలలో సంభాషణలో పాల్గొనేవారు, కథేతి వృత్తాన్ని మలుపు తిప్పేవారు ఉన్నారు. మౌనంగా నిలబడి సంఘటనలకు ప్రత్యక్ష సాక్షులైన వారూ ఉన్నారు. ఇన్ని రకాలుగా పాత్రలున్నా అన్ని ప్రత్యేక స్వరూప స్వభావాలతో భాసించటం సాధ్యంకాదు[2]. వాటిలో కొన్ని పాత్రలుగా కథాగమనానికి ఉపకరించేవిగా మిగిలిపోతాయి తప్పితే ప్రత్యేక వ్యక్తిత్వ ప్రకాశంతో నిలబడవు. అట్లా నిలబడే పాత్రలను, నాటి సామాజిక భావజాలాన్ని స్ఫుటంగా ప్రతిఫలించే పాత్రలను ప్రత్యేకంగా పేర్కొని ఆయాపాత్రల స్వభా వాన్ని విశ్లేషించటం జరిగింది.

### 3. 1. 1 అనంగసేన :-

విక్రమార్కుడికి సింహాసనం అప్పచెప్పటానికి వీలుగా భర్తృహరి రాజ్యం పరిత్యాగం చేయాలి కనుక, అందుకు కావల్సిన వాతావరణాన్ని సిద్ధంచేయటంలో కల్పింపబడిన కథలో అనంగసేన ముఖ్యపాత్ర. భర్తృహరికి ఇష్టమైన భార్య కనుకనే ఆమె బ్రతుకుతోటే తనబ్రతుకుందని అమరత్వము నివ్వకల్గిన పండును ఆమెకు ప్రసాదించాడు. ఐతే ఆ పండు కారణంగానే తానంతప్రేమించే భార్యమీది భర్తృహరికి అయిష్టత కల్గి ఆత్మకామినులను పరిత్యజించే స్థితి వచ్చింది. అనంగ

సేనకిచ్చిన ఆ పండు వచ్చి గుఱ్ఱపుసాలలో పేడనెత్తివేసే స్త్రీ బుట్టలో ఉండటాన్ని చూసి భర్తృహరి ఆ పండు చేతులు మారిన విధానాన్ని అర్థం చేసుకోవటంలో భాగంగా, భార్యకు పరపురుషుడితో సంబంధమున్న విషయాన్ని గ్రహించాడు. దానితో తానింత ఇష్టపడిన భార్యయే తనకు నమ్మకద్రోహం చేసిందన్న దుఃఖంలో సంసారాన్ని, రాజ్యాన్ని పరిత్యజించి వెళ్ళిపోతాడు.

అనంగసేన ప్రత్యక్షపాత్రే కానీ, మందడిడుతో సంబంధం ఏర్పరచుకున్న ఒక్క విషయంలో తప్ప ఒక్కమాట గాని, ఒక చర్యగాని ఆమెకు లేవు. భర్తృహరి విషయాన్ని తెలుసుకొని స్త్రీ మనశ్చాంచల్యాన్ని గురించి చెబుతూ, స్త్రీని ఎన్ని రకాలుగా తృప్తిపరచినా మనస్సు నిలకడ లేకుండా వికారాలకు లోనవుతూ చలిస్తుంటుందని అనుకుంటాడు. స్త్రీ స్వభావం నిలకడ లేనిదని అనటం పితృస్వామిక సమాజ లక్షణం. పునరుత్పత్తి శక్తికి సంబంధించిన విషయాలలో ప్రారంభంనుంచి పురుషుడిలో ఉన్న ఆశ్చర్యంతో కూడిన[3] భయంవల్ల స్త్రీలను కట్టడి చేయాలని భావించిన పితృస్వామ్య సమాజం ఎంత కట్టడి చేసినా ఆమెను తాను అదుపు చేయలేమోననే నిస్సహాయతకు లోనైన పరిస్థితి నుండి స్త్రీల స్వభావాన్ని గురించి అది చంచలమని తీర్పునివ్వటం జరిగింది. ఆ తీర్పు నెదుర్కొని సమాధానం చెప్పే స్థితి గాని, అవకాశంగాని స్త్రీకి లేదు. అందువల్ల పితృస్వామ్య సమాజం తనమీద ఆరోపించే స్వభావ చాంచాల్యన్నంతా మరోమాట లేకుండా స్త్రీలు భరించాల్సి వస్తుంది. అట్లా మౌనంగా అన్నీ భరిస్తూ ఉండిపోయిన స్త్రీలకు అనంగసేన ప్రతీక. అందువల్ల అనంగసేనలాంటి స్త్రీలు పితృస్వామిక సమాజంలో ఉండటానికి వీల్లేనివాళ్ళుగా ఈ కథా సందర్భం స్పష్టంగా నిర్దేశిస్తోంది. ఆమెవైపు నుండి చేసిన పనిని గురించి చెప్పటానికిగాని, దానికి కారణాలు వివరించటానికి గానీ ఆమెకు ఆస్కారం లేదు. ఆ కారణంగా అనంగసేనలాంటి స్త్రీలు పితృస్వామ్య సమాజం ఇచ్చిన ఈ తీర్పును ఎటువంటి ప్రశ్నలుగాని, మినహాయింపులుగాని లేకుండా తలదాల్చాల్సి వచ్చింది. పైగా స్త్రీ పరపురుషుడితో సంబంధం ఏర్పరచుకోలేదంటే అది ఆమె నీతినిజాయితీ వల్ల కాక, లోకభయం వల్ల అన్న అభిప్రాయం కూడ పితృస్వామ్య సమాజంలో ఉంది. 'పతియు, తోడి యతివలు పరులు చూసి ఎగ్గు ఒనరించెదరని' చేయదల్చుకున్న పని చేయకుండా స్త్రీలు ఆగిపోతారని అనుకునే పితృస్వామ్య సమాజం స్త్రీల కా విధమైన మనస్తత్వం ఉండటానికి పురుషుడు బాధ్యుడన్న విషయాన్ని మాత్రం బయటకు రానీయదు. పరస్పర విశ్వాసం కల్గించగలిగిన, ప్రేమతో కూడిన సాన్నిధ్యాన్ని పురుషుడు స్త్రీకి ఇవ్వలేకపోయాడు. అందుకు కారణం బహుభార్యాత్వ వ్యవస్థ పురుషుడికి ఉన్న ఈ లక్షణం స్త్రీ మానసిక

ప్రవృత్తి మీద ప్రభావం చూపటానికి అవకాశం వుంది. బహుభార్యత్వ వ్యవస్థలో స్త్రీకి తనకే సొంతమైన భర్త లభించటం కష్టం. కాని మానవుల శరీర ధర్మాలు వ్యవస్థ ననుసరించి సృష్టిని పొందలేవుకదా. దీనిని గుర్తించ నిరాకరించిన పితృస్వామ్య సమాజం పురుషుడు బహిరంగంగా చేయగలిగిన పనిని స్త్రీ చేస్తే తప్పుగా నిర్దేశిస్తుంది. పైపెచ్చు స్త్రీయొక్క శరీరాన్ని 'రోత కెల్లనిల్లగాదె' (1-100) అని అంటుంది. అసలు శరీర నిర్మాణంలోని జీవక్రియలో స్త్రీ పురుషులిద్దరూ సమానమే నన్న విషయాన్ని పితృస్వామ్య వ్యవస్థ విస్మరించింది. నిజానికి శరీరావయవాల ప్రయోజనం ఇద్దరికీ ఒక్కటే. అటువంటప్పుడు అంతవరకు ఇష్టమైన స్త్రీ అందంగాను, ఆమెమీద ఇష్టం తగ్గితే రోతగాను కన్పడటం పితృస్వామ్య సమాజంలో పురుషుడు ఏర్పరచుకొన్న స్వభావానికి మచ్చుతునకగా అనుకోకుండానే వ్యక్తం అయింది.

(2) విక్రమార్కుడి అగ్రమహిషి :

ఈమె విక్రమార్కుడి భార్య పేరుతో అవసరం లేకుండా బ్రతికినన్నాళ్ళు విక్రమార్కుడి భార్యగా బ్రతికిన స్త్రీ. విక్రమార్కుడు మరణించిన వెంటనే గర్భస్థ శిశువును తీసియిచ్చి సహగమనంచేసిన స్త్రీ ఈమె. పురుషుడికి భార్యగా బ్రతికే స్త్రీ అతని భార్యగానే చచ్చిపోవాలి. పితృస్వామ్య వ్యవస్థ భావజాలంలో పెరిగిన ఈమె సతికి పాల్పడటం ద్వారా కలగబోయే సంతానాన్ని కూడా లెక్క చేయకుండా తన పాతివ్రత్యాన్ని నిరూపించుకొంది. పితృస్వామ్య వ్యవస్థ భావజాలాన్ని నిలబెట్టడానికి ఇటువంటి వీర స్వభావం కలిగిన స్త్రీలు కావాలి. అనంగసేన పితృస్వామ్య సమాజంలో ఉండకూడని స్త్రీ ఐతే, విక్రమార్కుడి భార్య ఆ సమాజానికి కావల్సిన స్త్రీ. స్త్రీలు భర్త బ్రతికున్నంత కాలము మాత్రమే కాకుండా మరణించాక కూడా అతనిపట్ల విశ్వాసంతో ప్రవర్తించాల్సిన స్వభావాన్ని కగ్గిఉంచాలని విక్రమార్కుని భార్య పాత్ర ప్రవృతిద్వారా నిరూపించాడు కవి.

**(3) కాంతిమతి :–** ఈమె ధర్మశర్మడనే విప్రుని భార్య. పరపురుషునితో సంబంధం ఏర్పడి భర్త శాపకారణంగా రాత్రిపూట రాక్షసునిచేత దెబ్బలు తినే శిక్షకు గురి అవుతూ విక్రమార్కుడి వల్ల ఆ శోకంనుండి విముక్తిని పొందిన స్త్రీ. కాంతిమతి పాత్రద్వారానే తన భర్త మంచివాడని, తాను ఆ కార్యం చేసిందానికి ప్రతిఫలం ఆ శిక్ష అని చెప్పిస్తాడు కవి. అనంగసేన చేసిన పని తప్పని భర్తృహరి ఆమెను పరిత్యజించాడు. ఆ విషయంలో అనంగసేన తప్పు అనుకున్నదో, ఒప్పు అనుకున్నదో ఆ కథేతివృత్తంలో ప్రస్తావనకు రాలేదు కాని కాంతిమతి కథలో ఆమె చేసినపని తప్పని భర్త భావించడమే కాక కాంతిమతి కూడ తను చేసినది తప్పేనని

ఒప్పుకోవటం కనపడుతుంది. అంతేకాక అటువంటి పని చేసిన తనలాంటి భార్యను చంపటానికి, దండించటానికి భర్తకు హక్కు ఉందని కాంతిమతి నమ్మి ప్రవర్తిస్తుంది. చంపకుండా దండన విధించి ఊరుకొన్నాడు కనుక కాంతిమతి దృష్టిలో ఆమె భర్త 'భవ్యుడే' అయ్యాడు. భర్త చాటుగా ఇతర పురుషులతో సంబంధాలు ఏర్పరచుకొన్నా, ఆమెకూడ నైతిక అసమానతలున్న పితృస్వామ్య సామాజిక భావజాలాన్ని గౌరవించినట్లు కన్పడుతుంది. స్త్రీలు ఇటువంటి దృక్పథంతో ఉండటమే పితృస్వామ్య సమాజానికి కావల్సింది. అందుకే ఆమెను శిక్షించి ప్రక్షాళన అయ్యేటట్టు చేసి పితృస్వామ్య సమాజం ఈ వ్యవస్థలో ఆమెకు తిరిగి స్థానం ఇచ్చింది.

**(4) కందర్ప సంజీవని :-** ఈమె ఆధీనంలో ఒక రాజ్యం ఉంది. ఐతే ఈమె సలసల క్రాగుతున్న నూనె గంగాళంలో పడగలిగిన తెగువ చూపించగలిగిన వ్యక్తినే పెళ్ళాడతానని షరతుంది. విక్రమార్కుడు దానిలో పడితే అతన్ని బ్రతికించి 'తగుదాసిగా' తనను తాను సమర్పించుకోవటమేగాక తన రాజ్యాన్ని అతనికి సొంతంచేస్తుంది. కాని విక్రమార్కుడు ఆమెను స్వీకరించక తనబదులు సుమిత్రుడ్ని పెళ్ళాడమని చెప్పి ఆమెను, ఆమె రాజ్యాన్ని సుమిత్రుడికిస్తాడు. ఈ పాత్రద్వారా 'ఎంతటి సంపద కలవాళ్ళయినా భార్యలుగా దాసులే' అన్న విషయాన్ని స్త్రీ ముఖంగా నిరూపించటం జరిగింది. పైపెచ్చు దానిని మరొకసారి నొక్కి వక్కాణించడం కోసం విక్రమార్కుడిచేత 'దాసివేని' తాను చెప్పినట్లు వినమని చెప్పించటం జరిగింది. తన ఆర్థికస్థితితో ఏమాత్రం నిమిత్తం లేకుండా ఆ ఆర్థికస్థాయితోసహా పురుషుడికి 'దాసి' కావటం సహజ ధర్మంగా అనుకున్న స్త్రీ కందర్ప సంజీవని. పితృస్వామ్య సమాజానికి అనుగుణంగ స్త్రీ అంటే దాసిగ అనే స్వభావంతో ఉన్న పాత్ర ఈమె.

**(5) పేరులేని మరో స్త్రీ :-** ఈమె విక్రమార్కుని కొలువునందు ప్రదర్శింపబడిన గారడి విద్యలో భాగంగా భ్రాంతిగా కన్పించే పాత్ర. ఈ భ్రాంతికి రూపకల్పన అయిన ఈ స్త్రీపాత్ర కూడ పితృస్వామ్య సమాజం స్వభావాన్ని రూపుకట్టిస్తాడు కొరవి గోపరాజు. ఈ స్త్రీ భర్త మరణిస్తే సహగమనం చేయటానికి ధైర్యంగా ముందుకు రావల్సిన స్త్రీలకు ఒక ఆదర్శ నమూనాగా చిత్రించబడింది. విక్రమార్కుని భార్య పాత్రకు విస్తరణ రూపం ఈ పాత్ర. 'పతితోడిదే సతిజీవితం' అని నేర్పించిన పితృస్వామిక సమాజభావజాలంతో పెంచి పోషింపబడి ఆ వ్యవస్థ అస్తిత్వానికి అనుకూలంగా తీర్చిదిద్దబడిన పాత్ర ఇది.

మొత్తం మీద సింహాసన ద్వాత్రింశికలోని స్త్రీ పాత్రలన్నీ పితృస్వామ్య సమాజం నిర్దేశించిన పద్ధతిలో పురుషుడి చాటు వాళ్ళుగా, పురుష ప్రయోజనాలకను కూలంగా ప్రవర్తించే వాళ్ళుగా, తమ గురించి తామసలు ఆలోచించుకోనివాళ్ళుగా, పట్టించుకోనివాళ్ళుగా, ఏమాత్రం కాస్త ఆలోచించి ప్రవర్తించిన స్త్రీలయినా అంతిమంగా పితృస్వామ్య సామాజిక ధర్మానికి తలవొగ్గక తప్పని వాళ్ళుగా చిత్రితమయ్యారు.

## పాదసూచికలు - వివరణలు

(1) 'నీతి' అనేది నిర్దిష్టమైన సామాజిక చైతన్యరూపం. మానవుల మధ్యగల సంబంధాలను మంచి, చెడ్డ, న్యాయం, అన్యాయం. నిజాయితీ, బేనిజాయితీ మొదలైన ధాతువులలో ప్రతిబింబించేదే సమాజం యొక్క లేదా వర్గం యొక్క అవసరాలను మానవుని మీద అతని నిత్యజీవితంలో నైతిక ఆదర్శాల, సూత్రాల, ప్రవర్తన నియమ నిబంధనల రూపంలో నిర్ణయించేది. వ్యక్తిగత అవసరాలు నైతిక చైతన్యంతో యితర మానవులపట్లా, కుటుంబం పట్లా, సొంతవర్గంపట్లా, తన దేశంపట్లా రాజ్యం పట్లా వగైరాల పట్లా, నైతిక విధులుగా ప్రతిబింబితమౌతాయి. యీ విధుల నైతిక రూపంలోని ఒక విశిష్ట లక్షణం యేమిటంటే, అది వెంటనే బయటనుండి రుద్దబడినదిగా కనిపించక, మనిషియొక్క అంతర్గత విశ్వాసాలనుండి ఉద్భవించినట్లు కనబడుతాయి. కాని నైతిక చైతన్యం లేదా భావం నిసర్గమైనదికాదు. విద్య మూలంగా సామాజిక సంప్రదాయాలను, ఆచారాలను, అలవాట్లను జీర్ణం చేసుకోవడం మూలంగా నైతిక నియమాలు మానవుని 'అంతర్గత విశ్వాసాలు' అవుతాయి. నైతిక చైతన్యం ప్రకారమూ, వ్యక్తియొక్క విశ్వాశాల ప్రకారము వ్యవహరించడానికి అంతర్గత ప్రేరణగా అంతరాత్మ ఉద్భవిస్తుంది- బి. కెల్లె. యం. కొల్డోస్. చారిత్రక భౌతికవాదం-1979. పుట 252-

(2) కాత్యాయినీ విద్మహే — చివరకు మిగిలేది — పరిశోధనాగ్రంధము పుట - 172, 173

(3) భూమికి అనిర్వచనీయ శక్తులున్నాయి. అలాగే స్త్రీకి కూడ. ఈ ఆలోచనకు భౌతిక ప్రాతిపదిక అటు భూమి ఇచ్చిన పంటలనుంచీ, ఇటు స్త్రీ కన్న శిశువులనుంచీ సంక్రమించింది- దేవీప్రసాద్ చటోపాధ్యాయ - లోకాయత-తంత్రవాదం - హైదరాబాద్ - జూ - 1990- పుట 3.

# 4. ము గిం పు

## 4. 1. కొరవి గోపరాజు – సామాజిక అవగాహన :

కొరవి గోపరాజు వ్రాసిన సింహాసన ద్వాత్రింశిక రాజును విష్ణ్వంశ సంభూతుడుగా, వర్ణాశ్రమ ధర్మ పరిరక్షకుడుగా నిరూపించే సాహసాద్భుత కథలతో నిండి ఉంది. ప్రజల నందరిని పాలించవలసిన రాజుయొక్క సాహసౌదార్య గుణాలను వన్నెవన్నెలుగా వర్ణించడమే ఈ కథల ఉద్దేశము. ఈ విధమైన కథలలో రాచరిక వ్యవస్థను, రాజు జీవితాన్ని వర్ణించటమే ప్రధానమైనప్పటికీ ఆ రాజు మానవ వ్యక్తిగా ఇతరులతో సంబంధాలలోకి రావటాన్ని బట్టి ఏదో ఒకమేరకు సామాజిక ప్రజా జీవితం కూడ ఇందులో చిత్రితమైంది. రాజు, రాజుతోపాటు మంత్రులు ఇచ్చే దానాలను స్వీకరిస్తూ తరచూ అతని ఔదార్యగుణ ఫలితా లనుభవించిన బ్రాహ్మణులు, అరుదుగా వైశ్యులు ఈ కావ్యంలో పాత్రలుగా వస్తాయి. భారతీయ అలంకారశాస్త్రం చెప్పిన పద్ధతిలో చాతుర్వర్ణ్య వ్యవస్థలోనే పై మూడు వర్ణాల వారిని తన కావ్య కథా పురుషులుగా కొరవి గోపరాజు స్వీకరించటం గమనించవచ్చు. అందువల్లనే ఈ కావ్యం మొత్తం మీద శూద్రుల ప్రస్తావన అసలు రాదు. ఇకపోతే ఈ కావ్యంలో కనిపించే స్త్రీ పాత్రలను గురించి చెప్పుకోవాలంటే వాళ్ళు కూడ సాధారణంగా పై మూడు వర్ణాలకు చెందిన వాళ్ళే. ఇక స్త్రీల జీవితాన్ని సమగ్రంగా కథేతివృత్తాలలో భాగంచేయగలిగాడు కొరవి గోపరాజు. స్త్రీల శారీరక ధర్మాలను, సామాన్య స్థితిగతులను, మానసిక స్వభావాలను పరిశీలించి ప్రదర్శించటంలో కొరవి గోపరాజు చూపిన సర్వజ్ఞత్వం, సునిశిత పాటవం పేర్కొనదగినవి. కథా సందర్భాన్ని వాడుకొని 'స్త్రీ'కి పర్యాయపదాలను చెప్పాలని, తొమ్మిదవ బొమ్మ చెప్పిన కథలో సందర్భాన్ని కల్పించుకొని కమలాకరుని విద్యా పాటవ ప్రదర్శనలోని భాగంగా 'అబిడ్డ' అనే స్త్రీ వాచక శబ్దానికి పర్యాయ పదాలుగా ఉన్న 'నలబై' తెలుగు మాటలను వరసపెట్టి చెప్పాడు కొరవి గోపరాజు. మహిళల గురించి ఇంతటి పరిజ్ఞానంతో కావ్య కథేతివృత్తాలను మలుచుకుంటూ పోవటంలో కొరవి గోపరాజు మంచి ప్రతిభను కనబరిచాడు.

ఐతే కొరవి గోపరాజు 15వ నాటి పితృస్వామిక రాజకీయ వ్యవస్థలో భాగస్వామిక, దాని మత సాంస్కృతిక భావజాలంలో పరిణమించిన మేధావిగా మహిళల జీవితాన్ని పురుష దృక్కోణంనుండి తప్ప స్త్రీల దృక్కోణం నుండి ప్రదర్శించలేక పోయాడు. ప్రథమాశ్వాసంలోని బహుశ్రుతుని కథలో శారదానందుడి చేత రాజు

భార్య చిత్రపటాన్ని నేయించే సందర్భాన్ని పురస్కరించుకొని హస్తిని, శంఖిని, చిత్తిని, పద్మిని జాతి స్త్రీలను గురించి వరుసగా చెప్పాడు. ఆయా స్త్రీ జాతుల ప్రత్యేకతలను వర్ణించటంలో ఎక్కువ భాగం అంగాంగాలను వివరించేవిగా ఉన్నాయి. హస్తిని జాతి స్త్రీ స్వభావం 'జిడిముడిపాటు' (1-214 217) అని, శంఖిని జాతి స్వభావం కోపం అని, చిత్తిని జాతి స్వభావం దిమ్మరితనమని, పద్మిని జాతి స్త్రీ స్వభావం మాత్రమే ఒద్దికనైనదని ఆమె నెమ్మది కంఠంతో ఉంటుందని చెప్పి 'కలియుగమునఁ బద్మిని సత్కులమున లేదు' (1-218) అని తీర్పునిచ్చాడు. కలియుగమున 'పద్మిని' జాతి స్త్రీ లేదంటే ఉత్తమురాలైన స్త్రీలు అంటే 'ఒద్దిక' యైన స్త్రీలు లేరనే కవి ఉద్దేశం. ఇక ఈ యుగంలో మిగిలిన స్త్రీ లెవరంటే, జిడిముడిపాటు, కోపం గలవాళ్ళు, తిరుగుబోతులని కవి భావన.

ఈ కావ్యంలో కథలను చెబుతున్నప్పుడు ఏదో ఒక సందర్భాన్ని తన కనుకూలంగా చేసుకొని నీతి విషయాలను చెప్పాడు కొరవి గోపరాజు[1]. ఈ నీతుల్లో ఎక్కువ భాగం స్త్రీకి సంబంధించినదిగా ఉండటం గమనించవచ్చు. 'మూలం వైరితరోఽస్తి' అనియు' నారిహృదయం నమ్మ వలదని, వారాంగనలను నమ్మ రాదనియు, తరుణలతోడి రహస్యం కూడదనియు, తనవారని నమ్మ వలదనియు స్త్రీలమీద అపనమ్మకాన్ని రకరకాలుగా చెప్తాడు. వీటితోపాటు భామినులు ధనంబు లేనిపతి మెచ్చరు లేమియెకీడుగావున' (8-209) అని స్త్రీలగురించి చెప్పిన మాటలు కవికి ఉన్న పితృస్వామిక సామాజిక అవగాహనను స్పష్టం చేస్తాయి. అంతేకాదు కొరవి గోపరాజు స్త్రీలను పుణ్యస్త్రీలుగా, పణ్యస్త్రీలుగా విభజించాడు (4-190) పుణ్యస్త్రీకి మంగళ గుణమ్ములె సొమ్మలని చెప్పి పణ్యస్త్రీకి అందం, అలంకారం కల్గిన ఆకృతి ఉండాలని చెబుతాడు. పుణ్యస్త్రీని గుణవిశిష్టలచేత పణ్యస్త్రీ నించి వేరుచేసి నిరూపించిన కొరవి గోపరాజు ఇటు పురుషునికి స్వచ్ఛమైన సంతానాన్ని ఇవ్వటాన్ని ఉద్దేశించి ఏర్పడిన కుటుంబం, అటు పురుషుడి భోగలాలసతకు ఫలితంగా అభివృద్ధి చెందిన వేశ్యావ్యవస్థ పక్కపక్కనే కొనసాగే పితృస్వామ్య సామాజిక వ్యవస్థను సమర్థించినట్లే అయింది.

15వ శ. నాటి పితృస్వామిక రాచరికపు వ్యవస్థలో బ్రతికిన కొరవి గోపరాజు యొక్క సాంఘిక భావజాల దృక్కోణం నాటి సమాజానికి అనుగుణంగా ఉండటం సహజం. అందువల్లనే కవి ఈ వ్యవస్థపట్ల స్త్రీల ఆలోచనలను, ఆందోళనలను, వ్యతిరేకతలను ఎక్కడా ప్రదర్శించలేకపోయాడు. ఐనప్పటికీ ఆనాటి సమాజంలో మహిళాజన జీవితాన్ని పితృస్వామ్య సామాజిక విలువలు విస్తా

అదుపుచేస్తూ వచ్చాయో తెలుసుకోవటానికి బాగా అవకాశం ఇవ్వగల సమాజ ప్రతిఫలన కళారూపం సింహాసన ద్వాత్రింశిక.'

సింహాసన ద్వాత్రింశిక కావ్యంలోని వర్ణనలుకూడ నూతనమైనవని చాల ప్రశంసలను అందుకున్నాయి. పూర్వ కవితా మర్యాద నవీన వర్ణనములు చూసి తన కావ్యము రస సంపద్విభాసితముగా, మృదుమధుర పదయుతము నొనర్చిన గోపరాజు 'మహాకవి' అని ప్రశంసింపబడ్డాడు. 'అభ్యుదయమునకు ఆయువు పట్టయిన దేశితెలుగుకు గల విశిష్టత గుర్తెరిగి రచన చేసిన' వాడుగా చెప్పబడి అభ్యుదయ కవి అనిపించుకున్నాడు[2]. అయితే నవీన వర్ణనలనుబట్టి, భాషా విశిష్టతనుబట్టి కొరవి గోపరాజును అభ్యుదయ రచయిత అనుకోవటం మాత్రం సమంజసం కాదు. ఎందుకంటే ఆధునికార్థంలో అభ్యుదయం అంటే ఆర్థిక పునాదిలోని మార్పుతో కూడుకున్న సామాజికాభ్యుదయం. పితృస్వామ్య సామాజిక జీవిత దృక్పథం నుండి వ్రాసిన కొరవి గోపరాజు కావ్యంలో స్త్రీ జనాభ్యుదయం మచ్చుకైనా కానరాదు. కనుక అతను అభ్యుదయ రచయిత మాత్రం కాజాలడు.

ఐతే గోపరాజు కావ్యాన్ని పరిశీలించటం స్త్రీల సామాజికాభ్యుదయానికి, ప్రగతికి ఆటంకం కల్గించిన వ్యవస్థ యొక్క మూలాలను అర్థం చేసుకోవటానికి మాత్రం చక్కగా ఉపకరిస్తుంది. ఆ మేరకు సింహాసన ద్వాత్రింశిక మధ్య యుగాల మహిళా జన జీవితం పితృస్వామిక సమాజంలో అదుపుకు లోనవుతూ ఉండటాన్ని, మహిళలందరూ ఏ మినహాయింపు లేకుండా సమాజంలో రెండవ స్థాయి వ్యక్తులుగా బ్రతుకుతుండటాన్ని చిత్రించగలిగిం దనటంలో మాత్రం ఎటువంటి సందేహానికి తావులేదు. 15వ శ. నాటికి, నేటికి సామాజిక రాజకీయ పరిస్థితులలో అనేక పరిణామాలు వచ్చి స్త్రీల స్థితిగతులలో స్వేచ్ఛా సమానత్వ భావనలు అభివృద్ధి చెంది ప్రజాస్వామ్య ప్రభుత్వ వ్యవస్థలలో రాజ్యాంగ పరమైన హక్కులు లభించాయి కాని సమకాలీన పరిస్థితులలో కూడా మహిళ పరాధీనపు బ్రతుకులో చెప్పుకోదగ్గ మార్పేమీరాలేదు. స్త్రీ పురుషలను అసమానులుగా నిలబెట్టిన పితృస్వామ్య అసమసామాజిక వ్యవస్థ సమూలమైన మార్పుకు గురి కాకుండా స్త్రీల జీవితంలో అభివృద్ధి సాధ్యంకాదు. ఆ మార్పు కోసం పనిచేయగల చైతన్యాన్ని స్త్రీ పురుషులిరువురూ పెంచుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. సాహిత్య రచనలు, అధ్యయనం ఆ చైతన్యాన్ని పెంచటానికి దోహదకారులు కావాలి.

## పాదసూచికలు - వివరణలు

1) 'కావ్యమున నచ్చటచ్చట సందర్భముల ననుసరించి సార్వకాలికములును, సార్వజనీనములు నగునట్లు చెప్పబడి చెదరియున్న నీతి పద్యములన్నియు నేర్చికూర్చిన యెడ నొక చిన్న నీతిశాస్త్రమగును.
'వెంపరాల సూర్యనారాయణశాస్త్రి-సింహాసన ద్వాత్రింశిక-పీఠిక-ఆంధ్ర సాహిత్య పరిషత్తు-కాకినాడ-1936-పుట3

2) కొరవి గోపరాజు 'పూర్వకవితామర్యాద-నవీన వర్ణనములుచూపి యభ్యుదయమున కాయువుపట్టగు దేశి తెనుగునకు గల విశిష్టత గనిపెట్టి తద్భాషోచిత పోషణమున తన కావ్యము రససంపద్వికాసితముగా మృదుమధుర పదయుతము నొనర్చిన గోపరాజు మహాకవి యగుట నిస్సంశయంము'.
బులుసు వేంకటేశ్వర్లు- 'అభ్యుదయ రచయితల కభ్యుదయ రచయిత- నవంబరు భారతి-1946

## ఉపయుక్త గ్రంథాలు


1) ఆంధ్రమహాభారతం-నన్నయ్య

2) ఆంధ్రుల సాంఘిక చరిత్ర-సురవరం ప్రతాపరెడ్డిగారు

3) కార్లమార్క్స్, ఫ్రెడరిక్ ఏంగిల్స్ సంకలిత రచనలు-అనువాదం: నిడమర్తి ఉమామహేశ్వరరావు, కంభంపాటి సత్యనారాయణ, మహీధర రామ మోహనరావు

4) కొరవి గోపరాజు -సాహిత్యవిశ్లేషణ-అనుమాండ్ల భూమయ్య

5) చరిత్రలో ఏం జరిగింది-గార్డెన్‌చైల్డ్

6) చరిత్ర రచనలో మతతత్వం-రొమిల్లా థాపర్, హర్బన్‌ముఖియా, బిపిన చంద్ర

7) చారిత్రక భౌతికవాదం-వి. కెల్లె, యం. కొవల్జోన

8) చివరకు మిగిలేది-పరిశోధన గ్రంధము-కాత్యాయని విద్మహే

9) పురాతన సమాజం-లూయీహెన్రీ మోర్గన్
అనువాదం-మహీధర రామమోహనరావు

10) ప్రాచీన భారతదేశ చరిత్ర- డి. డి. కోశాంబి, అనువాదం కె. బాలచందర్

11) భారతీయ శకములు -కోట వేంకటాచలము

12) భారతదేశ చరిత్ర పరిచయ వ్యాసాలు-డి. డి. కోశాంబి
అనువాదం-రామకృష్ణ

13) యుగయుగాల్లో మహిళ- జె. వరలక్ష్మి

14) లోకాయుత-దేవి ఛటోపాధ్యాయి

15) సమగ్రాంధ్ర సాహిత్యం-5వ, 6వ సంపుటములు

16) 'హిస్టరీ ఆఫ్ ఇండియా-రొమిల్లా థాపర్

17) వ్యాసమంజరి-డా. నేలటూరి వెంకటరమణయ్య-ఆంధ్రసారస్వత పరిషత్తు
-1967

18) వ్యాసములు-టేకుమళ్ళ కామేశ్వరరావుగారు-కొరవి గోపరాజుకాలము అనే
-ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక-1967-పుట17

19) వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు-సింహాసన ద్వాత్రింశిక-పీఠిక
ఆంధ్రసాహిత్య పరిషత్తు-కాకినాడ 1936-పుట 7

20) కొరవి గోపరాజు - సింహాసన ద్వాత్రింశిక - మాడపాటి హనుమంతరావు
షష్ఠి పూర్తి సంచిక.

ప్రథమ ముద్రణ 1992

ప్రతులు 1000

ప్రతులకు

జె. కనకదుర్గ
లెక్చరర్స్ క్వార్టర్స్, రైటర్స్‌బస్తీ,
సింగరేణీ కాలరీస్, కొత్తగూడెం, ఖమ్మం జిల్లా.

వెల రు. 12-00

"జ్యోతి" ఆర్ట్ ప్రింటర్స్ - కొత్తగూడెం.